## కృష్ణాజిల్లా

# శాసన స్రవంతి

## 2




**కృష్ణా జిల్లా న్యూ మాన్యువల్ కమిటి**

**ప్రచురణ - 4**

సౌజన్యం : ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్

# కృష్ణాజిల్లా శాసన స్రవంతి

## 2

ఎడిటర్

**కె. ప్రభాకర రెడ్డి**, ఐ.ఎ.ఎస్.,

ముఖ్యమంత్రి అదనపు కార్యదర్శి

(ఛైర్మన్, కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ)

**కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ**

**ప్రచురణ - 4**

# కృష్ణాజిల్లా శాసన స్రవంతి

ద్వితీయ భాగం

*Editor*
**Sri K. Prabhakara Reddy,** IAS

*Asst. Editors*
**Sri Lanka Venkata Ramana,**
Ph: 9440087420

**Dr. G.V. Purnachand,**
Ph : 9440172642

Published by :
**Krishna District New Manual Committee**

Rs. **30-00**

1st Edition
Jan, 2007

*Copies can be had from :*

**SRI VENKATESWARA BOOK DEPOT**
11-16-32, Singarajuvari Street,
VIJAYAWADA-1 Ph : (0866) 2565038

**V.G.S. PUBLISHERS,**
D.No. 5-6-59/41, Ist Floor,
Tammina Krishnamurthy Street,
Near Sairam Theatre, VIJAYAWADA-9
Ph : (0866) 2510202

**RAVI PUBLISHERS,**
P.B. No. 799,
Benz Circle, VIJAYAWADA-10
Ph : (0866) 2476363






# ఆచరణ కావాలి

కృష్ణాజిల్లాకు సంబంధించిన శాసనాలన్నింటిని ప్రచురించాలన్న సంకల్పంతో తొలి విడతగా 'కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ' 2005 నవంబరు 27, 28 తేదీలలో విజయవాడ సిద్ధార్థ మహిళా కళాశాలలో నిర్వహించిన 'కృష్ణావైభవం'లో 'కృష్ణాజిల్లా శాసన స్రవంతి' ప్రథమ సంపుటాన్ని విడుదల చేశాం. ఇప్పుడు మీ ముందు రెండవ సంపుటం ఉంది. దీనితో కేవలం విజయవాడ శాసనాలన్నీ దాదాపుగా వంద వరకు తీసుకొని రాగలిగాం. ఇంకా ఎన్ని ఉన్నాయో తెలియదు. ఈ రెండు సంపుటాలు చూసిన వారికి ఈ నగరానికి సంబంధించి వెలువరించ తగినవి ఇంకా ఎన్ని ఉన్నాయో తెలిసే అవకాశం ఉంది. విజ్ఞులైనవారు దయచేసి వాటి ప్రతులను మాకు పంపించినట్టయితే వారి పేరుతో త్వరలో రానున్న మరో సంపుటంలో చేర్చగలం.

ఇప్పటి వరకు వెలువడిన రెండు సంపుటాలకు కీర్తిశేషులు బి.ఎన్.శాస్త్రిగారి సేకరణ చాలా వరకు ఉపకరించింది. ఇందుకు ఆ మహనీయునికి నివాళి.

మునుముందు ఈ జిల్లాకు సంబంధించిన అన్ని శాసనాలను డివిజన్ వారీగా ఒక పుస్తకంగా త్వరలోనే తీసుకొని రావాలని మా తలంపు.

ఈ ప్రచురణకు అన్ని విధాలా సహకరించిన ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్ట్ ఛైర్మన్ రామ్ కుమార్‌గారికి, ట్రస్టీ సంతోష్ చక్రవర్తికి, కొన్ని సంస్కృత శాసనాలకు అనువాదం అందజేసిన ప్రముఖ సంస్కృత పండితులు ధూళిపాళ రామకృష్ణగారికి కమిటీ పక్షాన ధన్యవాదాలు తెలుపుతున్నాను.

స్వల్ప వ్యవధిలో హంగులు సమకూర్చి నిరాటంకంగా వెలుగులోకి తెచ్చిన విక్టరీ పబ్లిషర్స్ అధినేతలకు, సిబ్బందికి ధన్యవాదములు.

ఈ పుస్తకంలోని ఫోటోలనన్నింటిని అందజేసి, గ్రంథానికి శోభనిచ్చిన శ్రీ దుర్గా మల్లేశ్వర దేవస్థానం పాలకవర్గానికి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ఇ. గోపాల కృష్ణారెడ్డిగారికి, యు. అబ్జారావుగారికి ధన్యవాదములు.

ప్రభాకర రెడ్డి

హైదరాబాద్.
తేదీ : 08.01.2007.

(కె. ప్రభాకరరెడ్డి)
ముఖ్యమంత్రి అడిషనల్ సెక్రటరీ

# విషయసూచిక

V

# రసరమ్య శిల్పాలు - శాసనాలు



కృష్ణాజిల్లా ప్రకృతి ప్రసాదించిన వనరులతో సంపద్విలసితమైనది. బందరు, ఘంటసాల, మోటుపల్లి, వాడపల్లి, విజయపురి రేవుల నుంచి క్రీస్తుకు పూర్వమే అమేయమైన స్థాయిలో వాణిజ్యం జరిగింది. క్రీస్తుకు పూర్వమే మన ఓడలు బర్మా, జావా, బోర్నియో, మలయా వరకు పోయి కృష్ణాతీర వణిజుల వ్యాపార ప్రతిభను లోకానికి చాటిచెప్పాయి. పైగా ఈ ప్రాంతమంతా సారవంతమైన నదీలోయ కావడం వల్ల పంటలు పుష్కలంగా పండేవి.

పవిత్రమైన శ్రీశైలం, అమరావతి, విజయవాద లాంటి క్షేత్రాలు ఈ జిల్లాకు ఆధ్యాత్మిక సంపదను సమకూర్చాయి. ఎక్కడ సిరిసంపదలు ఉంటాయో సహజంగానే అక్కడ సంస్కృతి కూడా వృద్ధి చెందుతుంది. ఆ విధంగా ఆంధ్ర సంస్కృతి పతాకం ఈ జిల్లాలో నింగికెగసింది.

విజయవాడ దుర్భేద్యమైన గిరిదుర్గం. చుట్టూ కొండలు, కారడవులు, మరో ప్రక్క దాట శక్యంకాని కృష్ణానదీ ప్రవాహం. ప్రకృతి ఈ విధంగా నగరానికి రక్షణ కవచం ఇచ్చింది. అంతేకాక ఈ నగరాన్ని స్వాధీనం చేసుకొంటే అటు పడమటవైపు, ఉత్తర దక్షిణ దిశలలోగల భూభాగాలు, తూర్పు దేశాలు చేజిక్కుతాయని పాలకులు ఆశించారు. ఈ ఆశతోనే ఈ నగరాన్ని రణరంగం చేశారు. అదే సమయంలో దుర్గాదేవికి, మల్లీశ్వరస్వామివార్లకు భూరి కానుకలు సమర్పించి శాసనాలు వేయించారు.

కనకదుర్గాదేవి యుద్ధదేవత. కొలిచిన వారికి సామ్రాజ్యలక్ష్మిని ప్రసాదిస్తానని అమ్మవారు అభయమిచ్చింది. మహిషాసుర మర్దనిని తలచుకొంటే శౌర్యసాహసాలు ఆవహిస్తాయని యుద్ధోన్మాదులు చెలరేగారు. నిజానికి అమ్మవారు అభయమిచ్చింది మనలోని మహిషాలను మర్దించి దైవస్వరూపం ఇస్తానని. మహిషాసుర మర్దనం కథలోని ఈ ఆంతర్యాన్ని అర్థం చేసుకోలేని మనుషులు అధికారం కోసం ఉపాసిస్తూనే ఉన్నారు. అమ్మవారికి కానుకలు పెరుగుతున్నాయి. మనలో మహిషాసురులు కండకావరంతో చెలరేగుతూనే ఉన్నారు. త్యాగ

పురుషుల వేషంలో చేసిన దానాలకు శిలాక్షర రూపం ఇచ్చి శాసనాలు వేయించారు. అలాగని నేడు మనకు లభ్యమవుతున్న శాసనాలు వేయించిన వారంతా యుద్ధోన్మాదులనడానికి వీలు లేదు. ఊరు పేరు లేకుండా మట్టికొట్టుకుపోయినవారు పోగా కొందరు మాత్రమే అనేక వందల సంవత్సరాల తరువాత నేడు కూడా స్మరణీయులయ్యారు. వారి శాసనాలే మిగిలాయి.

నాటి పాలకులు, పాతకులు, ధీమంతులు, శ్రీమంతులు, పండితులు, పామరులలో కొందరు సంగీత, సాహిత్యాది లలిత కళలను పోషించారనడానికి సాక్ష్యాలు శాసనాలలో లభిస్తున్నాయి. వారు నిర్మించిన ఆలయాలమీద, ఆలయ కుడ్యాలమీద, కోష్ఠాలమీద వీరాసన, ఉత్తిష్ఠ, త్రిభంగాది భంగిమల్లో అందంగా చెక్కించిన శిల్పాలు అనేకం ఉన్నాయి. రసరమ్యమైన ఆధ్యాత్మిక సందేశం ఇచ్చే పురాణ గాథలను చెప్పే శిల్పాలు కూడా కనిపిస్తాయి. ఆధ్యాత్మిక సందేశంతోపాటు ఆపాత మధురమైన సంగీతం, రంగస్థల కళలైన నృత్యనర్తన రీతులను ప్రతిఫలిస్తాయి.

విజయవాడ అక్కన్న మాదన్న గుహల సముదాయంలోగల శిథిల కనకదుర్గ మండపం మీద దీర్ఘ చతురస్ర ఫలకంపై రామాయణ కావ్యంలోగల గొప్ప ఆఖ్యాయిక శిల్పం ఉంది. ఆ ఫలకంలో. పైన శయ్యాగతుడైన ఒక మహర్షి, ఆయన క్రింద మేళ, తాళాలతో నృత్యం చేస్తున్న కళాకారిణులు కనిపిస్తారు. అత్యంత సుందరమైన ఈ శిల్పం ఏనాటిదో తెలియదు. అయితే ఇది క్రీస్తుశకం 9, 10 శతాబ్దులలోను, అటు తరువాత కొంతకాలం ఈ ప్రాంతంలో వర్ధిల్లిన తూర్పు చాళుక్య సంప్రదాయానికి చెందిన శిల్పమని రూఢి అవుతున్నది. ఈ శిల్పంలో వ్యక్తమయ్యే ఇతివృత్తం రామాయణ కావ్యంలోనిది.

శ్రీరాముడు అరణ్యవాసంలో ఒకసారి కిష్కింధను సందర్శిస్తాడు. అక్కడ పంచాప్సరహ్రద సరస్సు చేరతాడు. ఆ సరస్సు గురించి శ్రీరాముడు సుగ్రీవునికి చెబుతాడు. మందకర్ణి అనే మహర్షి తపస్సు ప్రారంభించాడు. తన తపస్సును సరియైన ప్రదేశం పంచాప్సరహ్రద సరస్సు అని ఎంచుకొంటాడు. ఆ సరస్సు ఉపరితలంపై శయనించి తపస్సు ప్రారంభిస్తాడు. తపోభంగం చెయ్యడానికి వచ్చిన అప్సరసలు ఆయన తపోబలం వల్ల సరస్సు అడుగు భాగానికి చేరుతారు. మందకర్ణి రుషి తపస్సుకు భంగం కలుగకుండా ఆ అప్సరసలే వీణ, మృదంగం, చిరుతలతో నృత్యగాన కళా కౌశలంతో మహర్షిని అలరిస్తూ ఉంటారు. తాండవ స్థితిలో ఉన్న అప్సరసల శిల్పాలు చూస్తే వారి నృత్యంలో వడి, వేగం బోధపడుతుంది.

పంచ అంటే 'ఐదు' అపస్సు అంటే 'నీరు' హ్రదము అంటే 'మడుగు'. పంచాప్సరహ్రదము అంటే ఐదు జలప్రవాహాలు సంగమించగా ఏర్పడిన సరస్సు. అంటే మన పృథ్వి (బుడమేరు), ఏలేరు, పాలేరు లాంటి వాగులతో ఏర్పడిన కొల్లేరు లాంటిదన్నమాట.

ఈ శిల్పం ఆధ్యాత్మిక సందేశానికి కళలకు, ఆధ్యాత్మిక శక్తికి మధ్యగల సంబంధాన్ని, మనం మరచిపోయిన కాలం నాటి కృష్ణామండల కళావైభవం, చరిత్రను ప్రతిబింబిస్తున్నది.



ఇలాంటి శిల్పాలే రెండు రథం సమీపానగల ఉత్తరాది మఠం ప్రవేశద్వారం వద్ద ఉండేవి. ఆ రెండు ఇప్పుడేమయ్యాయో తెలియదు. రెండు సంవత్సరాల క్రితం మఠాన్ని పునర్నిర్మించారు. అప్పుడు కూడా ఆ శిల్పాలు ఉండేవి. ఆ శిల్పాలు ఇద్దరు ధ్యానయోగులకు చెందినవి. ముఖ లంబం పైకి వచ్చేటట్టుగా వీణను నిలబెట్టి వీణావాదనం చేస్తూ ఉంటారు. తన్మయస్థితి, నాదోపాసన రెండూ ఆ శిల్పంలో వ్యక్తమవుతాయి.

అందమైన శిల్పాలు, శాసనాలు అనేకం ఉన్నాయి. అవన్నీ విజయవాడ నగర చరిత్రకు, సాంస్కృతిక వైభవానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి.

## పరాంతక దేవర శాసన ప్రత్యేకత

శాసన స్రవంతి మొదటి భాగంలో పరాంతక దేవర శాసనం గురించి ఇచ్చాము. బెజవాడ, కృష్ణాజిల్లాలోని ఇతర ప్రాంతాల ప్రాముఖ్యతను ఆవిష్కరించే ఇతర శాసనాలు కూడా ఉన్నాయి. ఆ దృష్ట్యా తులనాత్మక పరిశీలనకు పునరుక్తి దోషం లేకుండా పరాంతక దేవర శాసనాన్ని వివరణలతో ఇస్తున్నాము. విజయవాడ అక్కన్న - మాదన్న గుహల సముదాయంలో గల కనకదుర్గ శిథిల మండప స్తంభంపైన గల 33 లైన్ల శాసనాన్ని అందజేశాం. ఇప్పుడు ఆ శాసనానికి కొంత వివరణ ఇవ్వడానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి - అది కృష్ణాజిల్లా బెజవాడకు చెందినది కాగా రెండవది అందులో ప్రసక్తమైన అతి ముఖ్యమైన అంశాలు. 'ఎపిగ్రాఫియా ఆంధ్రికా' ఆరవ సంపుటంలో పదవ నంబరుతో డాక్టర్ మైనేని కృష్ణకుమారిగారు 'పరాంతక చోళుని బెజవాడ శిలాశాసనం' అన్న శీర్షిక (The Bezawada Stone Inscription of Parantaka Chola)తో వ్రాసిన శాసనం మా దృష్టికి వచ్చింది. అందులో కొన్ని అంశాలను ఉటంకిస్తున్నాం.

## బెజవాడ రడ్డికం

ఈ శాసనంలో లిపి 12వ శతాబ్దంలో వాడుకలో వున్న తెలుగు - కన్నడ మిశ్రమ లిపి. తెలుగు వచనం - పద్యం కనిపిస్తుంది. పద్యాలు కన్నడ, వృత్త గీతాలలో ఉన్నది. ఈ శాసనం అనేక విషయాల్లో ముఖ్యమైనది. తెలుగు - పల్లవులైన మాండలికులకు బెజవాడ రడ్డికాన్ని అప్పగించుతున్నట్లు తెలిపే శాసనం. అందులోను తొలి చాళుక్య చోళ రాజు ఒకటవ కులోత్తుంగుడు ఆంధ్ర దేశంపై ప్రభుత నెరపాడు. ఈయన కుమారుడే పరాంతక చోళుడు. ఈ పరాంతకచోళుని శిలాశాసనాలు దాక్షారామ భీమేశ్వరాలయంలోను, భీమవరంలోను ఉన్నాయి.

సాధారణంగా తూర్పు చాళుక్య ప్రభువుల శాసనాలన్నీ 'శ్రీ సర్వలోకాశ్రయ, శ్రీవిష్ణువర్ధన మహారాజులు త్రిభువన చక్రవర్తి' అన్న ప్రశస్తి వాచకంతో ప్రారంభమవుతాయి. ఈ శాసనం కూడా ఈ వాక్యాలతోనే ప్రారంభమైంది. పరాంతకుని అయిదవ విజయరాజ్య సంవత్సరం శ.సం. 1046 నాటి శాసనమిది. అంటే క్రీ.శ. 1115లో వేయించినది. రాజేంద్ర చోడ దేవుడి నుంచి బెజవాడ రడ్డికాన్ని బేతన, బొద్దసలకు అప్పగించుతున్నట్టు శాసనంలో వుంది. 29 - 30 - 32 లైన్లు చూడండి. తెలుగు పల్లవుల సుదీర్ఘమైన ఈ ప్రశస్తి కనిపిస్తుంది. 5 నుంచి 9 లైన్ల వరకు ప్రశస్తి కనిపిస్తుంది. మహా మాండలికుడైన భీముడు బొద్దన తమ్ముడు. మహామాండలికుడైన బొద్దనను శౌర్య సాహసాలలో మాంధాత, యయాతి మహారాజుతో పోల్చాడు. 20 - 21 లైన్లు చూడండి.

శాసనం ద్వితీయార్థం (11 నుంచి 33వ లైను వరకు) లో 1046 శక సంవత్సరం ప్రస్తావన వుంది. ఇది క్రీ.శ 1124 తో సమానం. మహామాండలిక భీముడి శౌర్య సాహసాలను మెచ్చిన రాజాధిరాజు, రాజ పరమేశ్వర, పరమభట్టారక, రవికుల తిలక, సత్యాశ్రయ తిలక, చాళుక్యాభరణ శ్రీత్రిభువన చక్రవర్తి శ్రీమత్ పెరమ్మానాది దేవుడు బెజవాడ రెడ్డికాన్ని శ.స. 1046లో ఇచ్చాడు. రసోదధి వాయు పథేందు అన్న సంకేతం ద్వారా శ.స. 1046లో భీమనకు బెజవాడ రడ్డికం ఇచ్చినట్టు ధ్రువపడుతున్నది. దీని తరువాత పద్యంలోని అక్షరాలు దెబ్బతిన్నాయి.

ఈ శాసనంలో పరాంతకుని బిరుదులు ఆయనవే ఇతర శాసనాల్లో కనిపించడం లేదు. అనగా పరాంతకదేవుని బిరుదులు కొన్ని కొత్తగా వెలుగులోకి తెచ్చే శాసనమిది.

పరాంతకదేవునికి త్రిభువన చక్రవర్తి, రాజసర్వజ్ఞ అన్న బిరుదులు కూడా ఉన్నట్లు లోకానికి మొదటిసారిగా ఈ శాసనం ద్వారా తెలిసింది. వేంగి రాజ ప్రతినిధులలో ఎవ్వరికీ కూడా ఈ బిరుదులు లేవు. దీనిని బట్టి ఆయనకు చాళుక్య - చోళ సింహాసనం వారసత్వంగా వచ్చినట్టు బోధపడుతున్నది.

బెజవాడ రడ్డికాన్ని తెలుగు పల్లవ మండలేశ్వరునికి కట్టబెట్టిన రాజేంద్ర చోడుని కుమారుడు పరాంతకుడు రెండవ రాజేంద్రమహారాజు కుమారుడే రాజమహేంద్రుడని డాక్టర్ యశోదాదేవి భావించారు. అయితే ఒకటవ కులోత్తుంగునికి కూడా రాజేంద్ర చోడ అనే పేరు వుంది.

ఈ శాసనం విశిష్ఠత మరొకటి వుంది. యనమలకుదురు శాసనం (ఎఫిగ్రాఫియా ఇండికా నాల్గవ వాల్యూమ్ 33వ నంబరు)లో పేర్కొన్న పల్లవ ప్రభువు రాజ వంశాన్ని నిర్ధారించడానికి ఈ శాసనం తోడ్పడుతుంది. బేతన, బొద్దన; వారి తమ్ముడు భీమన, యనమలకుదురు శాసనం ప్రకారం కేతనాయకుడు, తమ్ముబంగి ఇద్దరు అన్నదమ్ములు. తమ్ముబంగీ నాయకునికి ఇద్దరు సోదరులు. వారే బొద్దన, భీమనలు.

ప్రస్తుత శాసనం ప్రకారం పరాంతక దేవుడు బెజవాడ రడ్డికాన్ని మహామాండలిక బొద్దనకు ఇచ్చాడు. అటు తరువాత ఈ రడ్డికాన్ని పెరమ్మనాది దేవుడు భీముడికి ఇచ్చారు. ఇది జరిగింది. క్రీ.శ. 1124లో

## అద్దంకి శాసనం

కృష్ణాజిల్లా శాసనాల్లో అద్దంకి శాసనానికి స్థానం కల్పించడం సమంజసమేనా అన్న సందేహం కలిగితే అనుమానం అసమంజసం అనక తప్పదు. ఇందుకు రెండు కారణాలున్నాయి. ఒకటికి 102 సంవత్సరాల క్రితం అద్దంకి కృష్ణాజిల్లాలో ఉండేది. ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో వుంది. ప్రకాశం జిల్లా ఏర్పడకముందు గుంటూరు జిల్లాలో వుండేది.

ఎప్పుడో 102 సంవత్సరాల క్రితం కృష్ణా జిల్లాలో ఉన్నది కనుక ఇప్పుడు ఈ శాసన స్రవంతిలో ఎందుకు చేర్చాలి .... గుంటూరు జిల్లా శాసనాలనన్నింటిని చేర్చుకోవచ్చును కదా అన్న ప్రశ్నకు వివరణ ఇది.

ఆంధ్రదేశం శాసనాలన్నింటిలోను అద్దంకి శాసనానికి ప్రత్యేకత వుంది. కృష్ణాజిల్లా శాసనాలన్నింటి కంటే దీనికి ఎక్కువ ప్రాధాన్యం వుంది. తెలుగు పద్య సాహిత్యానికి తొలిసారిగా పట్టం కట్టిన శాసనం అది. అంతేగాక ఆ శాసనం వేయించిన వాడు తూర్పు చాళుక్య ప్రభువు గుణగవిజయాదిత్యుడు. ఆయన రాజధాని బెజవాడ. పైగా ఆయన తన సామంతుడైన పండరంగయ్య (పండరంగడు)ను శాసనాన్ని అమలు జరిపే అధికారిగా నియమించాడు. అంటే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అన్నమాట.

పండరంగడు గుణగ విజయాదిత్యుడిని చాలా యుద్ధాల్లో సేనాపతిగా నియమించుకొన్నాడు. అతడికి నేటి ప్రకాశం జిల్లా కందుకూరు, దాని పరిసరాలను అప్పగించి సామంతుడుగా నియమించాడు.

ఈ శాసనంలో పండరంగడు ప్రస్తావితుడయ్యాడు. ఇతడు పరమమాహేశ్వరుడు. అనంతరకాలంలో ఆయన పేరుతో పండరంగేశ్వరాలయం పేరుతో శివాలయం కూడా ఏర్పడింది.

గుణగ విజయాదిత్యుడు మహాపరాక్రమశాలి. ఆయన పట్టాభిషిక్తుడైన సంవత్సరంలోనే పండరంగడు సైన్యాధిపతి అయ్యాడు. గుణగుడిపై బోయెలు తిరుగుబాటు చేస్తే వాళ్ళను అణచివేయడం కోసం పండరంగడు సైన్యాన్ని కందుకూరు నుంచి బెజవాడ వరకు నడిపాడు. బోయెలకు చెందిన పన్నెండు స్థావరాలు (కొట్టాలు) లేదా కోటలను ధ్వంసం చేశాడు. ఆ

విధంగా త్రిభువనాంకుశుల (ఈ బిరుదుగల వేంగీ పాలకుల) పతాకాన్ని నిలబెట్టాడు. పండరంగడు కట్టెపురాన్ని నేల మట్టం చేసి, తన రాజధానిని బెజవాడవలె తీర్చిదిద్దాడు. ధర్మవరం గ్రామాల్లో ఆదిత్య భట్టారకునికి కొంత భూమిని దానంగా ఇచ్చాడు. ఈ విషయాలన్నీ ఆ శాసనంలో ఉన్నాయి. ఇప్పుడు ఆ శాసనం అద్దంకిలో ఉంది.

## శాసనం చూడండి :

1. ............... పుర ?
2. ............ భూపాల కుణ్డు
3. పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు బలగర్వంబొ
4. ప్పగ బైలేచి సేన పట్టంబుచు గట్టింఙ్జ ప్రభుం
5. బణ్డ రంగు (ం) బ (ణ్చి)న సామ(ం) త్త పదువతో బోయ
6. కొట్టంబు ల్వ ణ్డ్రె దు గొని వేంగి నాణ్టిం గొ తొల్చియ
7. త్రిభువనాంకుశ బాణనిల్పి కట్టెపు దుర్గంబు గదు
8. బయల్సేసి కణ్డుకు ర్బెజవాడ గావించమెచ్చి
9. పండ్డరంగు పరమ మహేశ్వరుణు ఆదిత్య బటరని
10. కి ఇచ్చిన భూమి ఎనుబది వుణ్ల అడ్లు పుట్టనేల ద
11. మ్మ పురంబున దమ్మవులు విని రక్షిఞ్జిన వారికి అస్వ
12. మేదం (బు) సపలం (బు) అగు

***ఈ శాసనాన్ని నేటి వర్ణ క్రమంలో ఇలా చదవవచ్చు.***

"పట్టంబు గట్టిన ప్రథమంబునేదు
బల గర్వమొప్పగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభు పండరంగు బంచిన
సామంత పదువతోబోయ
కొట్టముల్వంద్రెడు గొని వేంగినాటి గొఱల్చియ త్రిభువనాంకుశ బ్రాణ నిల్చి
కట్టెంపు దుర్గంబుగడు బయల్సేసి కందుకూర్బెజ వాడగావించ మెచ్చి

**గద్య**

పండరంగు పరమ మహేశ్వరుండు
అదిత్య భట్టారనికి ఇచ్చిన భూమి
ఎనుబడి పుట్ల ఆళ్ళు పట్టునేల
ధర్మపురంబున ధర్మువులు వీని
రక్షించిన వారికి అశ్వమేధంబున
ఫలంబు అగు ---

శాసనపాఠంలోని చుక్కలు గల భాగంలో అక్షరాలు చెరిగిపోయాయి.

క్రీస్తు శకం 848లో వేయించిన ఈ శాసనం - అంటే నన్నయ గారు పుట్టకముందే తెలుగు పద్యం మాధుర్యాన్ని చవిచూపిస్తున్నది. ఈ శాసనంలో పద్యభాగం అంతా తరువోజ వృత్తంలో వుంది.

తరువోజ వృత్తం ధ్రువాపదం నుంచి పుట్టింది. ధ్రువపద, దరువద, తరువద తరువోజ దీని రూపాంతరాలు. ఈ ధ్రువా పదాన్ని గురించి కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశతి ప్రబంధంలో చెప్పాడు. నన్నెచోడుడు దీనినే తరువద అన్నాడు.

మనకు దంపుడు పాటలున్నాయి. ఈ తరువోజనే దంపుడుపాట అంటారు. కావ్యాలంకార చూడామణిలో ఇలా వుంది :

"తలకొని తలంబ్రాలు దంపెడు చోట

తరుణులచే సొంపు దనరు దర్వోజ.

ప్రాచీన కవులు తరువోజును ఉపయోగించినా ప్రబంధకవులు వాడలేదు. దంపుడు పాటలు మాత్రా ఛందస్సులో ఉంటాయి.

ఛందస్సులో వృత్తముల చారిత్రక పరిణామం ఎలా ఉన్నదో ఈ శాసనంలోని తరువోజ (గాద్య కాకుండా మిగిలిన శాసనం) ద్వారా బోధకడుతుంది.

పండరంగడు గుణగ విజయాదిత్యుడు వేయించిన సాతలూరు, పోణంగి, మచిలీపట్టణం, ఉరుటూరు శాసనాలకు ఆజ్ఞప్తిగా వ్యవహరించాడు.

పండరంగడు భట్టకాళుని మునిమనమడు. కడియరాజు కొడుకు పండరంగడి మనుమడు గుణగ విజయాదిత్యుడు తరువాత అధికారంలోకి వచ్చిన ప్రథమ చాళుక్య భీముడికి కడియ రాజు ఆజ్ఞప్తి.

పండరంగడు పరమ మహేశ్వరుడే కాదు - గొప్ప కవిగా కనబడుతున్నాడు.

ఇన్ని అంశాలు నిబిడమైవున్న అద్దంకి శాసనం ఈ కృష్ణా శాసన స్రవంతిలో చేర్చుకోవడం సమంజసమే కదా !

# 1. తాటికొండ దాన శాసనం

ఇప్పటికి 1200 సవంత్సరాల క్రితం కృష్ణా జిల్లా ఎంత వైభవంగా ఉండేదో తెలియజెప్పే శాసనమిది. నిజానికి శాసనంలో తాంటికొండ అని వుంది. కాని తాడికొండగా నేడు ప్రసిద్ధమైంది.

క్రీస్తుశకం 808 నుంచి 847 వరకు ఈ ప్రాంతాన్ని నరేంద్ర మృగరాజ విజయాదిత్య మహారాజు పరిపాలించాడు. ఆయన క్రీ॥శ॥ 809లో విజయవాటి నగరం (నేటి విజయవాడ)లో తన పేరుతో సమస్త భువనాశ్రయ ఆలయం నిర్మించాడు. అది శివాలయం. మూడు అంతస్తులుగల గుడి. చిత్రవిచిత్రమైన అందమైన శిల్పాలు గల మందిరమది.

ఆలయం క్రమంగా శిథిలం కావడం మొదలైంది. 137 సంవత్సరాలు గడచింది. తరాలు మారినాయి. రెండవ అమ్మరాజు అధికారంలోకి వచ్చాడు.

ఈయన మహర్జాతకుడు. ఒక చేతిలో పద్మం, మరో చేతిలో చామరం, కలశం, రెండు అరికాళ్ళలో అంకుశ రేఖలతో పుట్టాడు. వయస్సులో అతడికి పెద్దవాళ్ళయిన సోదరులు ఉండగా ఎనిమిదవ ఏటనే మహారాజుగా నియమితుడయ్యాడు. పన్నెండేళ్ళ వయసురాగానే సింహాసనం అధిష్టించిన భాగ్యశాలి రెండవ అమ్మరాజ విజయాదిత్యుడు. విజయవాడను రాజధానిగా చేసుకొని క్రీస్తు శకం 945 నుంచి 970 వరకు ఎదురులేకుండా జనరంజకంగా పరిపాలించాడు. ఇతడు గజ, అశ్వ శాస్త్రాలలో మేటి. రాజనీతి శాస్త్రంలో తనకు తానేసాటి. మహావీరుడు. దీనజన యాచక చింతామణి. కవిగాయక వైతాళికులకు కల్పతరువు. శత్రుజనులకు మహాకాలభైరవుడు. ఎంత దయార్ద్ర హృదయుడో అంత చండ ప్రచండుడు. శైవమతావలంబి అయినా బౌద్ధ జైన మతాలను ఆదరించాడు.

తన పూర్వీకులు విజయవాడలో నిర్మించిన సమస్త భువనాశ్రయ ఆలయం శిథిలం కావడం చూడలేక పునరుద్ధరించాడు. నిత్యం బలి నివేదనలకు ఏర్పాటు చేశాడు. తపస్వుల భోజన వసతులకు సత్రం కట్టించాడు. ఆలయానికి సున్నం కొట్టించడానికి ఆర్థిక సదుపాయాలు కల్పించాడు. ఆలయ నిర్వహణకు గుండ్లకందేరువాటి విషయంలోని తాటికొండ, అమ్మలపూడి, అసులపఱ్రు, గొల్లపూడి (నేటి గుంటూరు జిల్లా) గ్రామాలను దానం చేశాడు. ఆ గ్రామాల మీద వచ్చే ఆదాయాన్ని ఎలాంటి పన్నులు లేకుండా ఆలయానికి చెందేటట్టుగా శాసనం వేయించాడు. ఆ శాసనాన్నే తాటికొండ అమ్మరాజ విజయాదిత్యుని శాసనమనీ, సంక్షిప్తంగా తాటికొండ శాసనమని అంటారు.

ఈ శాసనం ఇప్పటికి సుమారు వందసంవత్సరాల క్రితం నేటి గుంటూరు జిల్లా తాటికొండలో సత్యానందం అనే మాదిగ కులస్తుడు పాటిమన్ను కోసం మట్టిదిబ్బ తవ్వుతూ

ఉండగా దొరికింది. ఆరు రాగిరేకుల గుది అది. కొన్ని రేకులు కరిగించివేసి సొమ్ము చేసుకోగా ఇప్పుడు మనకు ఆరు రేకులు మాత్రమే మిగిలాయి. వెయ్యి సంవత్సరాల క్రితం కృష్ణా మండలంలో వాడుకలో వున్న తెలుగు లిపి ఈ శాసనంలో కనిపిస్తుంది. ఈ లిపిని వేంగిచాళుక్య లిపి అంటారు. ఈ శాసన రచయిత అమ్మరాజు గురువు విద్యేశ్వర పండితుడు. కాలాముఖ శైవపీఠానికి అధిపతి. ఆ పీఠం విజయవాడలో ఉండేది. చక్కని సంస్కృత శ్లోకాలలో రచించినా లిపి మాత్రం తెలుగులోనే వుండడం ఈ శాసనంలోని విశేషం.



మొదటి రేకు రెండవ వైపు

## శాసన పాఠం

మొదటి రేకు: రెండవవైపు

1. ఓం శ్రీవాగీశబ్జానామ్ స్వపాద నఖచంద్రమాః దేయా త్శివస్వయం శంవః
2. క్రియా కార్య్యంహీ కారణమ్॥ స్వస్తి శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మాన
3. వ్యసగోత్రాణాం హారీతి పుత్రాణాం కౌశికీ వరప్రసాదలబ్ధరాజ్యానామ్మాతృగణపరిపాలితా
4. నాం స్వామిమహాసేననుదామధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాపాదిత వ(ర)
5. వరాహలాఞ్ఛ నేక్షణక్షణ వశీకృతానాం మణ్డలానా మశ్వమేధావభృధస్నాన ప
6. విత్రీకృతవపుషాం చాలుక్యానాం సలమలం కరిష్ణోస్సత్యాశ్రయవల్లభేన్ద్ర
7. స్య భ్రాతా కుబ్జరిష్ణువర్ధన నృపతి దుష్టాదశషాఃణి వేంగిదేశ మపాలయత్
8. తదాత్మజోజయసింహస్త్రయ స్త్రింశత్ తదనుజేన్ద్ర రాజనన్దనో విష్ణువర్ధనో నవ॥ త
9. త్సూన మఃంగీయువరాజ పంచవింశతిం తత్పుత్రో జయసింహస్త్రయోదశ ॥ తదవ

రెండవరేకు :: మొదటివైపు

10. రజంకోక్కిలిష్టణ్మాసాన్ ॥ తస్య జ్యేష్ఠోభ్రాతా విష్ణువర్ధన స్తముచ్ఛాబ్య సప్తత్రింశత ॥ తత్పు

11. త్రో విక్రమాదిత్య భట్టారకోస్యష్టాశ తస్పుతో విష్ణువర్ధన షట్త్రింశతణ తత్సూనుభ్ఖా

12. నుభాసో రణవిగణనయా నీలకణ్ఠాలయనాంః సగ్రామారామకాణాం సలలితరమణీ సం

13. సదాం సత్పదానాం కృత్వా స్రోత్తుంగ మష్టోత్తరశత మభునగ్వీరధీనష్టయుక్తా నిశ్చత్వా

14. రింశత్సనూంక్ష్మాం జనమత విజయాదిత్యనామా నరేన్ద్రః తత్పుత్రః కలివిష్ణువ

15. ర్ధనో ధ్యర్ధవర్షమ్ తత్సుతోను సదాంక విజయాదిత్య మహారాజశ్చతుశ్చత్వా

16. రింశతమ్ తదనుజ యువరాజ విక్రమాదిత్య వరపాత్మజః చాలుక్య భీమభూప స్త్రింశతమ్

17. వితస్పుత్రో విజయాదిత్యో ద్విషదిన్ధనవాటిక స షణ్మాసా నసౌ సాక్షా దిన్ద్రో భోషేణ భూ

18. మిసః॥ తత్సూను రమ్మరాజ స్సప్తవర్షాణి తత్పితామహో గుణగాంక విజయాదిత్యానుజ యు

19. ద్ధమల్లాత్మజః తాలాధిపో మాసమేకమ్ ఈ యుధి వినిహత్య చాలుక్య భీమాత్మజో విక్రమా

రెండవరేకు :: రెండవవైపు

20. దిత్య అదినికరతిమిరదినకరః ద్విజదీనానా బద్ధు రేకాదశమాసాన్ శతస్తాలపరాజనస్త

21. సూనుస్సాకృతవాక్రభు యుద్ధమల్లధరాధీశ స్సప్తవర్షా ణ్యహద్భువమ్ ॥ రక్షత్యాఙ్ఞునసన్ని

22. భో జనపదాత్తన్నిర్గమయ్యోద్ధతాన్దా యాదా వినభ్యామలీన భగణాకారా న్విధారోభిరాన్

23. వజ్రీవోర్ణిత నాక మమ్మనృపతే భ్రాతా కవీయాన్భుమ భీమో భీమ పరాక్రమ స్పమభువన్ సవం

24. త్సరా ద్వాదశ 11 తస్య మహేశ్వర మూర్తినిరుమా సమానాకృతే మసారాద లోక

25. మహాదేవ్యా బలుయస్సమభవ దమ్మరాజాత్య జలజాతపత్ర చామరక

26. లశాంకుశ లక్షణాంక కరచరణకలశ లసదాజాన్వవలంబిత భుజయుగపరిఘో

27. సామాజస్కః వివిధ ధరాధిపవిద్యో వివిధాయుతకోవిదో విలీనాకికుల కధిమ నాగమ

28. కుశలో హరచరణాంభోజయుగలమధుపః శ్రీమాన్ కవిగాయక కల్పతరు ద్విజముని దీ

29. నాన్ధబన్ధజన మనభిం యాచకగణ చింతామణి నవనీతమణి మ్మజ్జహోగ్రమముద్భవో



మూడవరేకు ::రెండవవైపు

30.మాహేశ్వరః గుడ్లకణ్డేవ్వాఁడి విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖా న్కుటుంబినః సం

31.మాహూయే త్థమాజ్ఞాపయతి విదితమస్తు వః విజవాట్యాం చాలుక్య కులతిల

32.క సమస్తభువనాశ్రయ విజయదిత్యనరేన్ద్ర మృగరాజ ప్రతిష్ఠాపితాయ సమస్త

33.భువనాశ్రయ నామ దేవాలయ నివాసాయ ఉమామహేశ్వరాయ ఉత్తరాయణ నిమి

34.త్త అస్మద్దేశ సన్తత్యాయురారోగ్యైశ్వర్యాఁభివృద్ధ్యర్థఁం తద్దేవాలయ ఖం

35.ణ్డ స్ఫుటిత నవకమ్మఁ బలినివేద్యాతోద్య సత్రప్రవర్తఁనార్థఁం చ అల్ప

36.వృత్తితయా ఆలూన విశీర్ణ్ణఁం పువర్ణ్ణఁవీ కర్తుఁం సర్వ్వఁకర పరిహారేణ దేవ(భో)(కృ)

37.త్యోందక పూర్వ్వఁం తాణ్డికొణ్డవామగ్రామః అమ్మలపూణ్డి గొల్లపూణ్డి ఆసువులపల్లింగా

38.మాదిసమేతో స్మాభిర్దఁత్త ఇతి అస్య సగ్గ్రామస్యాటిక స్యావధయః పూర్వ్వఁతః తూ

39.ణ్ణేఱు ॥ అగ్నేయతః గారలగుణ్ట దక్షిణతి లామున యుత్తరంబున బూరుగు నైవృత్యతః

నాల్గవరేకు :: మొదటివైపు

40.ఒడ్డగుణ్ట ॥ పశ్చిమతః చయిత నామతటాతకమ్ వాయవ్యతః భీమసముద్రనా

41.మతటాక(మ్) ఉత్తరతః ఎనుకటాలు ఈశానతః రేగదుగుణ్ట ॥ యుగేయుగే

42.స్వీకృతరుద్రమూర్త్తఁయెూ మునీశ్వరాః శ్రీకులీశ్వరాదయః బభూవ రత్రానుగృహీతసజ్జనాః

43.స్వయంభువో ధమ్మఁయోవధప్రదర్శినః ॥ తదన్వయేం కాలముఖా శ్రుతిముఖ్యాస్స్వయంభువో భువి

44.భూభృతా మభివన్ద్యా (ః) త త్సింహవర్షదస్తే స్థానస్యాస్యాధిపతయ ఇహ హితచ

45.రితాఃతేషా మమరవటేశ్వరా ద్యనేక పురాణ దేవాయతన నివాసి(నాం) కాలముఖా
46.నాం సంతతౌ లకశిపున్నిభిలాగమ పారదృక్ పశుపతి మ్మ్ర్నివోపి పత్రిశ్శియః ॥ సుజ
47.లశాకపయః ఫలమూలకై వ్విహిత ధమ్మ్ర్శరీర వివర్ధనః యస్తమ్మనేశ్శిష్య ప్రభూత
48.పణ్డిత స్సాక్షాద్ధమ్మాకారశావం తద్ఛిష్యా విద్యేశ్వర నామేశ్వరౌ తత్ర్పభూతరాశి భ్రాతృభువనరా
49.శిమునే శ్శిష్యో పశుపతి ప్రభూతరాశిశ్చ కాలముఖేన్ద్రాద్యపరనామా తచ్ఛిష్య పశుపతి పర

# 2. వేంగి భూపతి, గొంకభూపతుల శాసనం

ఇది తొమ్మిదిలైన్లుగల సంస్కృత శాసనం, వేంగీదేవమహారాజు వేయించిన శాసనం. శాసన లక్ష్యం ఏమిటో బోధపడదం లేదు. చివరి అక్షరాలు చెరిగిపోయినాయి. కృష్ణా జిల్లాతో సహా చాలా ప్రాంతాన్ని పాలించిన మల్లభూపతి, గొంక రాజ వంశాల ప్రసస్తి మాత్రమే కనిపిస్తున్నది. శాసనభావం లక్ష్మీకాంతుని (విష్ణుని) నుండి బ్రహ్మజన్మించెను. అతని వలన అత్రి, అత్రికి చంద్రుడు, చంద్రునికి బుధుడు, బుధునికి పురూరవ చక్రవర్తి జన్మించెను. తరువాత ఆ వంశమున వేంగ్గీశ్వర ప్రభువు జన్మించెను. అతనికి మల్లరాజు, మల్లరాజునకు గొంక్కరాజు జన్మించెను.. 2. అతనికి పాల సముద్రమునుండి చంద్రుడు ఉద్భవించినట్లు రాజులందరు ఆశ్రయించదగిన వాడైన శోభిల్లు వంశవిస్తారకుడైన మహాదేవమహీపాలుడు జన్మించెను.. 3. అట్టి ఆ రాజు తన పితరులప్రీతికై మల్లేశునకు బాగుగా వెలుగొందు దీపమును ద్విబాణ శివశక సంవత్సరమున కార్తీక మాసమున సమర్పించెను. అనగా క్రీ.శ. 1088.

## శాసన పాఠం

లక్ష్మీకాంతా దభూద్బ్ర
హ్మాతస్మాద త్రిస్తతశ్శశీ॥ తస్మాద్బుధస్తతోజా
తశ్చక్రవర్తీ పురూరవాః॥ (1) తతస్తదన్వయే జా
తో వెంగ్గీశ్వర నరేశ్వరః॥ మల్లభూవల్లభ స్తస్మా
త్తతో గొంక్క మహీపతిః॥ (2) తస్మాదభూన్మహాదే
వ మహీశో వంశవర్ద్ధ నః॥ సర్వ్వ రాజాశ్రయః
శ్రీమాన్ చంద్రః క్షీరాంబుధేరివ॥ (3) సోయం ప్రా
దాత్పిత్రు ప్రీత్యై మల్లేశాయ సముజ్వలం॥ ద్వి...
బాణ శివశాకాబ్దే కార్తీ క్యేదీపమా....

౨.

## 3. ప్రోలెనాయని కొడుకు వాసెన శాసనము

ఇది మల్లీశ్వరాలయం ఉత్తర ద్వారమండప స్తంభాన గల శాసనం. శక సంవత్సరం **1055**లో అనగా క్రీ.శ. **1123**లో ప్రోలెనాయకుడు వేయించాడు. తన తండ్రికి ధర్మార్థంగా అంటూ సాగిన వాక్యం అసంపూర్ణంగా నిలిచిపోయింది. అక్షరాలన్నీ చెదరిపోయినాయి.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1055
గునెంటి ఆషాడ బ... సోమవారమున
దక్షిణాయన సంక్రాంత్తి నిమిత్తము
నందనరుంబ... ప్రోలెనాయకు కొ
డుకు వాసెన దమ తండ్రికి ధ
ర్మ్మముగా....

## 4. నాగదేవుని శాసనము

శక సంవత్సరం **1056**లో అనగా కీ.శ. **1134** దక్షిణాయన పుణ్యకాలంలో బొద్దయనాయకుడు దగ్గర ప్రధాన మంత్రి అయిన నాగదేవుడు వేయించిన శాసనం. మల్లీశ్వరస్వామికి నిత్యం మానెడు నెయ్యి పొయ్యాలని శాసనకర్త ఆజ్ఞప్తినిను ఆదేశించడమే గాక ఈదానం అచంద్రార్కం కొనసగించాలని కోరాడు. దానగ్రహీత వామనబోయిని కోటయ శాసన కట్టడి చేస్తూ వ్యాసమహర్షి చెప్పిన స్వదత్తం అనే శ్లోకాన్ని ఉదహరించాడు. సాధారణంగా మధ్య యుగాల శాసనాలన్నిటిలోను ఈ వ్యాస విరచిత శ్లోకం తప్పక కనిపిస్తుంది.

తనచే ఇవ్వబడినది. లేదా పరులచే ఇవ్వబడినదగు భూమిని అపహరించువాడు అరవైవేల సంవత్సరములు మలమున పురుగుగా పుట్టును.

### శాసనపాఠం

స్వస్తిశ్రీ వేంగ్గి దేశ చాళుక్య
నంక్కకాల పరమణ్ణల చూ
ఱకాఱ పతి దేవగురు ద్వి
జ భక్తులు గుఋమఱజ
ముద్దైన శ్రీ మన్మహామ
ణ్ణలిక బొద్దయ నాయకుల

ధ్యక్ష నాగదేవణ్డు సకవర్ష
ములు 1056గు నేట్టి దక్షి
ణాయన నిమిత్తము బెజవా
డ మల్లీస్వర మహాదేవరకు
ం బెట్టిన అఖణ్డ దీపము ని
నుప ఎడ్లు 55 వీనిం జేకొని
పోమన బోయిని కోటయ
ఆ చంద్రార్కముు నిత్యమా
నెణ్డు నెయి నడపంగలవా
ణ్డు॥ స్వదత్తాం పరదత్తాం వా యో
హరేత వసుంధరాం। షష్టిర్వర్షు స
హస్రాణి విష్టాయాంజాయతే
క్రిమిః॥

## 5. కొనకంద్రవాడ ముప్పమ శాసనము

**ఇది శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన గల శాసనం. శాసనం శక సంవత్సరం 1062 అనగా క్రీ. శ. 1140 ఆ సంవత్సరం పుష్యశుద్ధ త్రయోదశీ శుక్రవారం కొనకంద్రవాటి మహామండలేశ్వరుడు సుబ్బయ తన తల్లి ముప్పమ పుణ్యం కోసం మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించే లక్ష్యంతో స్వామివారికి ప్రతినిత్యం మానెడు నెయ్యి పొయ్యాలని కట్టడి చేశాడు. ఈ దానాన్ని స్థానాపతి దామయ స్వీకరించాడు. నెయ్యి ఇవ్వడం కోసం పది మాదలు దానం చేశాడు. ఇది విలక్షణమైన శాసనం.**

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1062 గు నేటి పౌష్య శు
ద్ధ త్రయోదశి శుక్రవారమున శ్రీ వత్రిభువ
న చక్రవతిశ్రీ కులొత్తుంగ్గ చోడ దేవరాయ
విజయరాజ్యదివ్య సంవత్సరములు 16గు శ్రీ
హి శ్రీ మన్మహా మండలిక కొనకంద్ర వా
డి సబ్బయ తల్లి ముప్పమంగారు దమకు ద
ర్మ్మువుగా బెజవాడ శ్రీ మల్లీశ్వర మహాదేవ
రకు నఖండవర్తిదీపమునకు,
నిందుల స్థాన
పతులు చామ్యెన... వశానం బెట్టిన
మాదలు 10....
యీ పది మాదలు... నిత్య మానెందు
నెయి నడపం
గలవారు॥

## 6. సూరపనాయకుని శాసనము

శిథిల మండప స్తంభంపైన గల ఎనిమిది పంక్తుల శాసనం. శక. సంవత్సరం 1065 ఉత్తరాయణ సంక్రాన్తినాడు సూరమ సూరపనాయకుడు వేయించిన శాసనం. మల్లీశ్వరునికి అఖండ దీపం పెట్టించడానికి ప్రతినిత్యం మానెడు నెయ్యి కావాలి. ఆ నెయ్యి ప్రోలయ అందజెయ్యాఇలి. ఆ చంద్రతారార్కం దానం కొనసాగించాలని సూరపనాయకుడు ఆదేశించాడు. అలా ప్రోలనాయకుడిని కట్టడి చేస్తూ 55 గొర్రెలు దానం చేస్తూ శాసనం వేయించాడు. శాసనం చివర వ్యాస శ్లోకం వుంది.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1065 గు నేంటి యుత్తరాయ
ణ సంక్రాంత్తి నిమిత్యంబున సూరమ సూరపనాయ
కుణ్డు బెజవాడ శ్రీ మల్లీశ్వర మహాదేవరకు యఖణ్డ
దీపము కన్నియ బోయిన ప్రోలయకు యినుప యె
డ్లు 55 (1) వీనింజేకొని ఆచంద్రార్క్కము నిత్యమానెణ్డు
నెయి వోయంగలవారుం బుత్రాణు పవిత్రిక
ము॥ స్వదత్తం పరదత్తంవా యోహరేతు వసుంధ్ధరా
ం॥ షష్టివ్వర్షా సహస్రణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

## 7. కట్టారి దాసిరెడ్డి కొమ్మిరెడ్ల శాసనము

మల్లీశ్వరస్వామికి నిత్యం మారబోయని కుమారుడు మానెడు నెయ్యి పొయ్యాలని కట్టారి దాసిరెడ్డి, కొమ్మిరెడ్డి శ.సం. 1069 విష్ణు సంక్రాన్తినాడు శాసనం వేయించాడు. అందుకు 55 గొర్రెలు దానం చేశాడు. దాన గ్రహీతలు మారబోయుని కుమారులు.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1069 గు నేంటి
విషువు సంక్రాంత్తినాండు విజయవాడ మ
ల్లేశ్వర శ్రీ మహాదేవరకు కట్టారి దా
సిరడిని కొమ్మిరడిని తమ తండ్రి కాసిరడికిన్ని త
మ తల్లి కామసాన్కి ధమ్ముర్వుగా అఖండ దీప
మునకు నిచ్చిన ఇనుపయెడ్లు 55 వీనింజే
కొని మారబోయ్ని కొడ్కులు చందరబోయుండు
... ... బోయుండు నిత్యమానెండు నెఇ ద (అసంపూర్ణము)

# 8. నారాయణదేవుని శాసనము

శిథిల స్తంభంపైన శ.సం. 1072 విష్ణుసంక్రాన్తినాటి శాసనం. మహామాండలికుడు బొద్దన కుమారుదు నాగదేవుడు వేయించిన శాసనం. మల్లీశ్వరునికి ప్రతినిత్యం మానెడు నెయ్యి పొయ్యాలనీ, ఈ బాధ్యత ఆచంద్రతారార్కం కొనసాగించాలని శాసన కర్త ఆశిస్తూ దానపరిగ్రహీత కోసం ఎరక కుమారుడు కొమ్మడు. శాలివాహన సంవత్సరం 1072కి సరియైన క్రీ.శ. సంవత్సరం 1156లో వేయించిన శాసనం. మొత్తం 13 పంక్తులు గల శాసనం చివర సంస్కృతం శ్లోకం వుంది.

## శాసన భావం

శివాలయమున దీప, ఆరామ., తటాకములందు (దీపము, ఉద్యానము, చెరువు (కొలను)ల విషయమున) విరిగిన, పగిలిన వాటిని సంస్కరించువాడు (జీర్ణోద్ధరణ చేయువాడు) మౌలికమైన (ఆధారమైన = సుఖభోగాదులకు ఆధారమైన ఫలమును (పుణ్యమును) పొందును.

## శాసన పాఠం

స్వస్తిశ్రీ వెంగ్గిదేశ చాలుక్య సంక్కాఱ పర
మండల చూఱకాఱపతి దేవ గురుద్విజ భ
క్తులు గుఋమఱజముండును నయిన
శ్రీమన్మహామండలిక బొద్దనక కొడ్కు నారా.
యణ దేవండు సకవర్షములు 1072
గు నేంటి విషువు సంక్రాన్తి నిమిత్తము
న బెజవాడ శ్రీ మల్లేశ్వర మహాదేవరకు
నఖండ దీపమునకు నిచ్చిన యినప ఎ
డ్లు 55 వీనింజెకొని గోసరి ఎఱ్ఱక కొడ్కు
గొమ్మండు నిత్యమానెండు నెయి యాచ
ంద్రాక్కఃముం బోయంగ్గలవాడు॥ ఖండస్ఫుటి
త సంస్కారం మఃకుర్య్యాతు శివాలయే దీపా
రామ తటాకేషు లభతే మౌళికం ఫలం ॥ పత్ర॥

## 9. బయ్యపదేవరాజు శాసనము

పెదవేగి బయ్యపదేవ మహారాజు శ.సం. 1072లో మల్లేశ్వరసామికి పెట్టిన రెండు దీపముల ఖర్చుకు గాను రెండు దీపముల ఖర్చుకు గాను రెండు గేదెలు దానం చేశాడు. దానగ్రహీత నాగరాజు సూరి. గేదెలతో ప్రతినిత్యం మూడు మానికల నెయ్యి పొయ్యాలని శాసనకర్త ఆదేశించాడు.

### శాసనపాఠం

బెజవాడ మల్లేశ్వర దేవదివ్య శ్రీపాద పద్యారాధకుండు పెద
వేంగి బయపదేవమహారాజులు బెజవాడ మల్లేశ్వర దేవరకు
సకవరుషంబులు 1072 నేటి ఆబ్యపదేవండు పెటిన
దీప (లురె)ండు పెటిన గేందెలు (..2) వీనింజేకొని నా
గ రాజు సురి నిత్య మూండు మానికలు నేయి పోయ
ంగలవారు॥

## 10. ప్రోలిదేసటి కుమారుడు మల్లిదేసటి శాసనము

ఇది శ.సం. 1108లో అనగా క్రీ.శ. 1186లో వేయించిన శాసనం. మొత్తం 39 పంక్తులుగల సంస్కృతం. పాఠంలో ప్రతి పంక్తి చాలాచిన్నది. శాసనకర్త ప్రొలిదేసటి కుమారుడు మల్లిదేసటి. జ్యోతి సిద్ధవటేశ్వరస్వామికి మహా భక్తుడు. ఇతడు తుంబురునాడు, కల్లర్తి విషయాధీశ్వరుడు. బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించడానికి 25 ఆవులు దానం చేసిన సందర్భంగా వేసిన దాన శాసనం ఇది.

దీని భావం. స్వస్తి. వెండి, పాలు ముత్యపు చిప్ప, ముత్తయములవంటి శుభ్రమైన లేదా స్వచ్ఛమైన లేదా తెల్లనైన) కీర్తితో కూడినవాడు. కవులు, గాయకులు, సత్యమును తెలుసుకొనగోరి సంభాషించువారు (దార్శనికులు) వక్తలు, దీనులు, దిక్కులేనివారికి పారిజాతము (కల్పవృక్షము వంటివాడు) చతుర్థ (శూద్ర) వంశ సముద్ర విస్తారకుడైన చంద్రునివంటివాడు. ఘడికోటగుండమున పుట్టిన వంశమును భరించు వాడు, ప్రకాశించు ప్రతాపము కలవాడు, కల్లత్తి విషయము (దేశము) మొదలగువాని ప్రభువు, భయమునకు, లోభము (పిసినారితనము)నకు లొంగని జ్యోతి(వెలుగు)ని సిద్ధింప చేసుకున్నవాడు., వట్టేశ్వరదేవుని దివ్యమైన శ్రీపాదపద్మములను ఆరాధించువాడు (పరం = శత్రు) శత్రువుల బలమును సాధించువాడు తుంబూరునాడు దేశ అధినేత, శుభములైన ఐదు 'మహా' శబ్దములను పొందిన మహారాజ్య వైభవముతో కూడిన.

## శాసన పాఠం

**మొదటి ప్రక్క**

స్వస్తి రజతక్షీర శు
క్తి ముక్తాఫల కీ
ర్తి సమేత కవి గ
మకీ వాది వాగ్మి దీ
నానాధ పారిజా
త చతుర్థాన్వయ
వార్ధివర్ధన తారా
ధీశ్వర ఘడికోట

**రెండవ ప్రక్క**

గుండోద్భవ వంశ
భృానుభాస్వత్ర్వ తా
ప కల్లత్తి విషయా
ది వల్లభ భయలోభ
దుర్లభ జోతిసిద్ధ వ
ట్టేశ్వర దేవ దివ్య శ్రీ
పాద పద్మారాధక
పరబలసాధక.

**మూడవ ప్రక్క**

తుంబూరునాంట్టి
దేశాధినేత స్వస్తి
సమధిగత పంచ
మహాశబ్ద మహారా
జ్య విభవ సమేతు
లైన శ్రీమతు ప్రోలి
దేసటి కొడుకుమల్లి దే
సటి బెజవాడ మ
ల్లీశ్వర శ్రీ మహాదేవ

**నాల్గవ ప్రక్క**

... కు 1108 నేంటి... మా
ఖ మాస బహల చతుర్ధ
శియు బుధవారము
నాండు అఖండదీప
ముకుం బెట్టిన మో
దాలు 25 వీనిం జేకొని
కన్నెబోఇని కొడ్కు కా
చెనబోయుందు పు
త్ర పౌత్రికము నిత్య
మానెందు నెయి ఆచ
ంద్రార్కమ్ము నడపంగ్గల
వాండు ఇ బోయినికి
తోడెపూండి అందు మా
న్యంబు... ... ... ....

# 11.సబ్బిరెడ్డి శాసనము

బిరాజ్ ఎదురు దర్గాకు సమీపంలో ఇరిగేషన్ కార్యాలయం ఆవరణలో లభించిన ఈ శాసనం శా.శ. 115 అనగా క్రీ.శ. 1193 నాటిది. మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించడానికి సబ్బిరెడ్డి అనే ఆసామి గొర్రెలు దానంచేశాడు. ఆ సందర్భంలో వేయించిన శాసనం. దాన స్వీకర్త ఎవరో తెలియదు. అక్షరాలన్నీ చెదిరిపోయాయి.

## శాసనపాఠం

| | |
|---|---|
| శకవర్షంబు... ... | సబ్బెరడి .... .... |
| 1115 గు నేం... ... | న.... .... .....ది... |
| మల్లేశ్వర శ్రీమ ... .... | నిం జేకొని... .... |
| .... మ .... .... రకు | .... .... త్యసో |
| దాదిపాకులో .... .... | ండు నేయి .... ... |
| రడి నామనా .... ... | దపం గలవా... ... |

# 12.మైదుబోయిని కుమారుడు కొమ్మనబోయుని శాసనం

కనకదుర్గ శిథిల మండప స్తంభంపైన గల ఏడు పంక్తుల శాసనం. శా.శ. 1122 విష్ణుసంక్రాన్తినాడు అనగా క్రీ.శ. 1200లో మైదుబోయుని కుమారుడు కొమ్మనబోయుడు దానం స్వీకరించడానికి చెందిన శాసనం. మల్లీశ్వరస్వామికి అఖండదీపానికి నిత్యం మానెడు నెయ్యి కావాలి. అందుకు కొమ్మనబోయుడు దానగ్రహీత.

## శాసనపాఠం

బెజవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు
1122 ండగు విషువు సంక్రాంత్తి నిమిత్య
మున మైదుబోయిని కొడ్కు కొమ్మన బోయ్యుండు
అఖండదీపమునకు నిచ్చిన పశులు 25 వీనిం జేకొ
ని కొమ్మనబోయ్యండు తన పుత్రానుపౌత్రికము
నిత్యమానెండు నెయి ఆచంద్రార్క్కము నడప
ం గ్గలవాండు॥ భీమదేవని బీమ కొమ్మనబోయుండు॥

## 13. బ్రహ్మారెడ్డిపుత్రుడు మరిరెడ్డి శాసనము

**మ**ల్లీశ్వరాలయం తూర్పుద్వారం కుడివైపున గల శిలపై 11 లైన్లలో శ.సం. 1125లో వేయించిన శాసనమిది. ఆ సంవత్సరం మాఘచతుర్దశి శుక్రవారంనాడు బ్రహ్మారెడ్డి కుమారుడు మరిరెడ్డి మల్లీశ్వరునికి అఖండ దీపం పెట్టదలచి కొమ్మనబోయుని కుమారుడు ఎరియముత్తరాజుకు 25 ఆవులు దానం చేశాడు. ముత్తరాజు ప్రతినిత్యం మానెదు నెయ్యి పొయ్యాలి. ఈ బాధ్యత ఆచంద్రతారార్కం కొనసాగాలని దాత ఆశించాడు.

### శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 11
25 నేంటి మాఘమాస చతుర్ద
శియు శుక్రవారమున బ్రమ్మరడ్డి
కొడ్కు అమరిరడ్డి విజయు
వాడ మల్లేశ్వర మహాదేవర
కు అఖండ దీపమునకు నిచ్చిన మో
దాలు 25 వీనిం జేకొని కొమ్మనబోయు
ని కొడ్కు ఎఱియె ముత్తరాజులు నిత్య
మానెందు నెయి ఆ
చంద్రార్క్కము బో
యంగలవారు॥

## 14. దాడికొమ్మిరెడ్డి శాసనము

**మ**ల్లీశ్వర ఆలయ స్తంభంపై మూడు పంక్తులలో కనిపించే శాసనం ఇది అసంపూర్ణంగా వుంది. దాడి కొమ్మిరెడ్డి తన తల్లి మాంకసాని, తండ్రి నారపరెడ్డి వారికి (సద్గతులు కలగాలని కోరుతూ) అన్న అసంపూర్ణ వాక్యంతో శాసనం ఆగిపోయింది.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1132 గు నేంటి
విషుము సక్రత్తినందు దాడి కొమ్మిరడి తమతం
డ్రి నారపరడికి తమ తల్లి నూంకసానికి

# 15. వాసుదేవప్పగారి కుమారుని శాసనము

ఇది వేంగి దేశాధీశ్వరుని సేవకుడు వాసుదేవప్ప కుమారుడు శా.శ. 1135లో అనగా క్రీ. శ.1213లో వేయించిన శాసనం. వాసుదేవప్ప కుమారుడు తన తండ్రికి తల్లి అన్నసానికి సద్గుతులు కలగాన్నఆకాంక్షతో విష్ణుసంక్రాన్తినాడు బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించిన సందర్భంగా వేయించిన శాసనం. కొమ్మనబోయని కుమారుడు కామెబోయుడు దానప్రతిగ్రహీత మల్లీశ్వరునికి ప్రతినిత్యం మానెడు నెయ్యి పుత్రపౌత్రాపారంపర్యంగా ఆచంద్రార్కం అందచెయ్యాలని ఆశించాడు. అయితే ఏమి దానం చేసింది కనిపించదు. శాసనం శిథిలమండప స్తంభంపైన కనిపిస్తుంది.

## శాసన పాఠం

స్వస్తిశ్రీ చతుర్ద్దఃశ
భువనాదీశ్వరుండైన
పెద వేంగేశ్వర దేవదివ్య
శ్రీపాద పద్మరథకుండైన
వాసుదేవప్పనం గారి కొడుకు
..... .... .... .... ....
... ..... ..... తల్లి అ
న్న సానికిని దనకు ధ
మ్ముఃవుగా స్వస్తిశ్రీ శ
క వషఃంబు 1135 గు నే
(ంటి) విషువు సంక్రాంత్తి ని
మిత్యమున విజఇ
వాడ శ్రీ మల్లేశ్వర శ్రీ మ
హా దేవరకు ... ...
కు నిచ్చిన ... ....
వీనిం జేకొని కొమ్మన
.... బోయుని కొడ్కు
కామెబోయుండు దన పు
త్రాను పవిత్రికమున నా
చంద్రార్క్కఃము నిత్య మా
నెండు నెయి నడపం గల
వాండు। శ్రీ।।

## 16. సేవకేతినాయుని శాసనము

బహుశా ఈడ్పుగల్లు ప్రాంతానికి చెందిన సేవకేతి నాయుడు వేయించిన శాసనం. తనకు సద్గతులు కలగాలని ఆకాంక్షిస్తూ మల్లీశ్వరస్వామికి ప్రతినిత్యం మానెడు నెయ్యిదానం చేశాడు. అందుకు అవసరమైన 55 గొర్రెలను పాయసం కాటిబోయుని కుమారుడు పరుసనబోయునికి దానం చేశాడు. భాద్రపద శుద్ధ ఏకాదశి సోమవారం శ్రవణానక్షత్రంలో దానం చేసినట్టు వుందిగాని ఏ సంవత్సరమో చెప్పలేదు.

### శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 11
గు భాద్రపద శుద్ధ 11 శ్రవణ సో
నక్షత్రమునాండు మల్లేశ్వర శ్రీ
మహాదేవరకు ఇదుపుగంటి సేవ
కేతినాయుండు తనకు ధర్మ్ముంవుగా
అఖండ దీపమున కిచ్చిన గొఱియలు 56
వీనింజేకొని పాయసము కాటిబోయు
ని కొడ్కు పరుసన బోయుండు నిత్య
మానెండు నెయి పోయంగలవారు॥

## 17. లామనానాయబోయుని శాసనము

ఇది కూడా శిథిల కనకదుర్గ మండపంలోని ఒక స్తంభంపైన కనిపిస్తుంది. శా.శ. 1141 ఉత్తరాయణ సంక్రాన్తినాడు లామనానర్యబోయడు మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించడానికి అవసరమైన నెయ్యిదానం చెయ్యడానికి ఈ శాసనం వేయించాడు. నేతికి అవసరమైన 55 గొర్రెలను ఎడిద పల్లమ ఎరబోయుని కుమారుడు బయ్యన దానం చేశాడు. దానపాలన బయ్యన పుత్రపౌత్రికంగా ఆచంద్రతారార్కం కొనాసాగాలని దాత ఆశించాడు.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1141 గు నేంటి ఊ
త్తరాయన సంక్రాంతి నిమిత్యమున లామనా
నాయ్యంబోయుండు మల్లీశ్వర శ్రీ మహా
దేవరకు అఖండ దీపమునకు నిచ్చిన
గొఱిలు 55 వీనింజేసుకొని ఎడిద పల్లమ
ఎఱబోఇని కొడుకు బయ్యన తన పుత్రాను
పౌత్రికము చంద్రార్క్కంమును నిత్యమానెం
డు నెఇ వోలంగలవారు॥

## 18. లామనమారెబోయుని కొడుకు నార్యబోయుని శాసనము

ఇంద్రకీల పర్వతపాద సమీపానగల శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వున్నాఎనిమిది లైన్ల శాసనం. శ.సం. 1143 ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తం లామనమారెబోయని కుమారుడు ఆర్యబోయుడు అఖండ దీపం ఎత్తించే సందర్భంలో వేయించిన శాసనం. క్రీ.శ. 1221వ సంవత్సరం ఆర్యబోయడు 55 మేకలుదానం చేశాడు. దానగ్రహీతలు వెదురను మారబోయని కుమారులు కొమ్మెవారలు ఆచంద్రతారార్కం స్వామికి మానెడు నెయ్యి పుత్రపౌత్ర పారంపర్యంగా దానం కొనసాగించాలని దాత ఆశించాడు.

### శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1143 గు నేం
ట్టి ఉత్తరాఅన సంక్రాంత్తి నిమిత్యమున
లామన మారెబోయుని కొడ్కు నాయ్యాబో
య్యుండు మల్లీశ్వర శ్రీ మహాదేవరకు అ
ఖండ దీపమునకు నిచ్చిన ఇనుప ఎడ్లు 55
వీనింజేకొని వెదుర మారకొడ్కులు కొమ్మెనా
రెలు ఆచంద్రర్కమ్ము నిత్యమానెండు నెయి పు
త్రాను పౌత్రము పోయంకలవారు

## 19. మారెబోయుని శాసనము

ఇది కూడా శిథిలమండప స్తంభంపైనే వుంది. ఏడు లైన్ల శాసనం. శ.సం. 1143 నాటిది. అనగా క్రీ.శ. 1221 ఉత్తరాయణ సంక్రమణంనాడు ఆమనకుల బోయుని కుమారుడు ముత్తెనబోయుడు కుమారుడు మారెబోయుడు తను తాతతల్లిదండ్రుల పుణ్యంకోసం మల్లీశ్వరసామికి అరదీపం ఎత్తించాడు. అందుకు 13 ఆవులు దానం చేశాడు. మారెబోయుడు దానస్వీకర్త. ఆచంద్రతారార్కం స్వామికి నిత్యం మానెడు నెయ్యి ఇవ్వాలని ఈ దానపాలన పుత్రపౌత్ర పరంపరగా ఆచంద్రతారార్కం కొనసాగాలని దాత కట్టడి చేశాడు.

### శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1143 నేంటి ఉత్తరాయణస

ంక్రాంతి నిమిత్తమున విజయవాడ శ్రీ మల్లేశ్వర శ్రీ మహా
దేవరకు అంచునకులె బోయుని కొడ్కు ముత్తెబోయిని కొడ్కుమా
రెబోయుండు తమ తాత తన తల్లిదండ్రులకు తనకు ధర్మార్థముగా అరదీ
పమునకుం బెట్టిన మోదాలు 13 (౹) వీనింజేకొని మారెబోయుండు దానతన
పుత్రానుపౌత్రికము నిత్యతవ్వెందు నెయి ఆచంద్రార్కముం బోయంగ
లవాండు॥

## 20. పారెబోయుడు, నూకిబోయుల శాసనము

**ఈ శాసనం కనకదుర్గ శిథిల మండపస్తంభంపైన ఉంది. ఆరు పంక్తుల ప్రకటన ఇది. శ.సం. 1144లో అనగా క్రీ.శ. 1222 సంక్రాన్తినాడు పల్లవ కొమ్మనబోయని కుమారుడు పారెబోయడు, మనుమడు నూకిబోయడు తమ తల్లిదండ్రులకు సద్గతులు కలగాలని ఆశిస్తూ వేయించిన శాసనం. అందుకోసం మల్లీశ్వరస్వామికి అరదీపం ఎత్తించారు. నెయ్యికి అవసరమైన 13 ఆవులను సూరబోయనికి దానం చేశాడు. ప్రతినిత్యం మానెడు నెయ్యి తరతరాలుగా స్వామికి అందచెయ్యాలని దాత ఆశించాడు.**

## శాసన పాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1144 నేంటి ఉత్తరాయన సంక్రాం
తి నిమిత్తమున విజయవాడ శ్రీ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు పల్లవ కొమ్మ
న బోని కొడ్కు పారెబోయుండు పారెబోని కొడ్కు నూకిబోయుండు తమ తల్లి
దండ్రులకు తనకు ధర్మార్థముగా అరదీపమున కుంబెట్టిన మోదాలు 13
నూరెబోయుం
దేపే తన పుత్రాను పౌత్రికము ఆచంద్రార్కము నిత్య తవెందు నెయి పోయంగలవా
ండు శ్రీ॥

## 21. వీరచోడవల్లభుని శాసనము

శిథిల మండప స్తంభంపై పది పంక్తులలో కనిపించే శాసనం ఇది. వీరబోచవల్లభుడు స్వామికి అఖండదీపం ఎత్తించే సందర్భంగా ఈ శాసనం వేయించాడు. ఈయన కుమార్తె ఎరకమ. స్వామికి నిత్యం మానెడు నెయ్యి అందచేసే నిమిత్తం చెరియబోయని కుమారుడు కాటయబోయనికి 55మేకలు దానంచేశాడు. ఈ దానం ఆచంద్రతారార్కం కొనసాగాలని దాత్రి శాసనంలో పేర్కొన్నది.

### శాసనపాఠం

కరగిరి వియదిందుగణనమై పరగంగాశకు
నేండ్లు అక్షత్రితీయయ్యు మిహిరవాసరము
న బాలేందుధగుండయన బెజవాద మల్లీశ్వర
గౌరి వల్లభునకుంగొను వరవీర చోడవల్లభుం
డు అఖండవర్త్తిదీపంబు సురుచిరంబుగ నాత్మను
త ఎఱకమకును సుభముగా నిచ్చె॥ యిద్దివియ
కుం చెరియబోయుని కొడ్కు గాటయబోయిని వ
సమునంబెట్టిన యినుప ఎడ్లు 55 వీనింజేకొని
నిత్యమానెందు నెయ్యి యాచంద్రార్క్కముం బోయ
ం గ్గలవాండు॥

# 22. మహామండలేశ్వరత్రినయన వల్లభ సిద్ధయ దేవచోడమహారాజు శాసనము

శిథిల మండప స్తంభంపైన గల శాసనం. 14 పంక్తులున్నాయి. సమగ్రంగానే కనిపిస్తున్నది. శ.స. 1150 మాఘశుద్ధ దశమి శనివారంనాడు మల్లీశ్వరస్వామికి పల్లవసిద్ధ త్రిణయన చోదయదేవ మహారాజు పెదవెలి గ్రామాన్ని దానం చేశాడు. శాసనం చివర వ్యాస శ్లోకంతో పాటు ధర్మానికి విరుద్ధంగా వ్యవహరించిన వారు పంచమహాపాతకాలకు పాల్పడినవారు అవుతారని చెప్పాడు. శాసనకాలం క్రీ.శ. 1238.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర త్రిణ
యన పల్లవ సిద్ధయదేవ మహారాజులు ఇంద్ర
కీల పర్వత నివాసుండైన యా దక్షిణవారణా
సి బెజవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవర ది
వ్య శ్రీపాద పద్మారాధకులైన శివయోగి మా
దయ శక వర్షంబులు 1156గు నేంటి
మాఘ శుద్ధ 10 వద్దవారమునాండు బెజ
వాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు హ
విర్బల్యార్చ్చ నాదులకు పెదవెలిగండ్లు
ఆచంద్రార్క్కముగా నిచ్చితిమి॥ స్వదత్తం ప
రదత్తాంవా ఓ హరేతి వసుంధరాం షష్టిం వ
ర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥
ఇ ధర్మ్మవునకు విఘ్నము నేసినవారు పంచ
మహాపాతకం నేసినవారు వారణాసి వ్రచ్చినారు॥

# 23. పోతెబోయుని శాసనము

శిథిల కనకదుర్గ మండప స్తంభంపై తొమ్మిది పంక్తులలో చెక్కబడిన శాసనం ఇది. శ.సం. ఉత్తరాయణ సంక్రాన్తినాడు మారెబోయని కుమారుడు తన తండ్రికి, తల్లి కొమ్మసానికి, తనకు పుణ్యంకావాలని మల్లీశ్వరస్వామికి నెయ్యిదానం చేస్తూ శాసనం వేయించాడు. దానస్వీకర్త సంతానభోవి పోతెబోయని కుమారుడు అన్నెబోయదు అన్నెబోయదు పుత్రపౌత్ర పారంపర్యంగా నిత్యము మానెదు నెయ్యి పొయ్యాలని ఆశించాడు. శాసనకాలం క్రీ.శ.లో 1229వ సంవత్సరం.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ శక

వర్షఁంబులు 1151 నేంటి ఉత్తరాయన సంక్రాంతి నిమిత్తము

న లామన మారెబోని కొడ్కుపోతె బోయుండు

తమ తండ్రి మారెబోనికు తమ తల్లి కొమ్మసాన్కి

తనకు ధమ్మ్ముఁవుగా మల్లేశ్వర శ్రీ మహాదేవరకిచ్చి

న అఖండ దీపము మోదాలు 25 వీనిం జేకొని

సంతనభోని పోతెబోని కొడ్కు అన్నెబోయుండు

దన పుత్రానుపౌత్రికము నా చంద్రార్కఁము ని

త్య మానెందు నెయి పోయంగలవాండు॥

## 24. విల్లూరి శాసనుడు వింజరాజు శాసనము

శిథిల మండప స్తంభంమీద 8 పంక్తులతో చేసిన శిలా ప్రకటన ఇది. శాసనకాలం శ.స. 1163, సరియైన క్రీ.శ. 1230 ఆ సంవత్సరం చైత్ర బహుళ ఆదివారంనాడు అత్తిలినాటిలోని విల్లూరు శాసనుడైన యాజ్ఞవల్కి శాఖీయుడు, కాశ్యపగోత్రీకుడు వింజరాజు బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించాడు. ఆ సందర్భంగా 40 మేకలను ప్రోలెబోయుని కుమారులు అమెరబోయడు చరిసెన్నకు దానం చేశాడు. ఆ మేకల నుండి వచ్చే నెయ్యి నిత్యం మానెడు వంతున ఆచంద్ర తారార్కం పుత్రపౌత్రపరంపరగా మల్లీశ్వరునికి. అందే విధంగా దానం కొనసాగించాలని దానకర్త నిర్దేశించాడు.

### శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్షంబులు 1152 నేంటి చైత్రబహు
ల అష్టమియు నాదివారమునాండు అత్తిలి నాటిలోపలి వి
ల్లూరి శాసనుండును ఆజ్ఞవల్లి శాఖయు గాశ్యగోత్రుండునునై
న వింజరాజు బెజవాడ మల్లీశ్వర శ్రీ మహాదేవరకు అఖండ
దీపమునకు ఇచ్చిన మేంకలు నలుభ-ను 40 వీనిం జేకొ
ని ప్రోలె బోయ్యని కొడ్కులు అమరెబోయుండునుం చరిసెను
యీ దీపమునకు నిత్యమానెండు నెయి పుత్రాను పౌత్రిక
ంబు ఆచంద్రార్కంము నడపంగ్గలవారు॥ శ్రీ.

# 25. గొడ్లప్రోలెబోయుని శాసనము

**శిథిల మండప స్తంభంపైన 12 లైన్లతో చెక్కించబడిన శాసనం. శాసన కాలం శా.శ. 1154 అనగా క్రీ.శ. 1232. ఆ ఏడాది విష్ణుసంక్రాన్తినాడు గొడ్లప్రోలెబోయుడు తన తల్లిదండ్రులకు ధర్మంగా మల్లీశ్వరస్వామి సంధ్యాదీపానికి అవసరమైన నేతికోసం ఏడు ఆవులు దానంచేశాడు. ఈ గొడ్లప్రోలిబోయుడే నిత్యం సోలెడు నెయ్యి స్వామికి తీసుకొని పోయేవాడు.**

## శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్ష
ంబులు 1154 నేంటి
విష్వ సంక్రాంత్తి నాండు
గొడ్ల ప్రోలెబోయుండు
తమ తల్లిందండ్రికథ
మ్ర్మువుగా మల్లీశ్వర శ్రీ
మహాదేవరకు సంధ్యా
దీపానకు నిచ్చిన మోదా
లు 7 వీనింజేకొని ఇ
గొడ్ల ప్రోలెబోయుదు
నిత్య సోలెందు నెయి
నడపం గలవారు॥

# 26. లామనబోయుని కొడుకు బయ్యని బొయ్యనబోయుని శాసనము

శిథిల మండప స్తంభంపైన గల 8 లైన్ల శాసనం ఇది. శ.స. 1158 ఉత్తరాయణ సంక్రాన్తినాడు అనగా క్రీ.శ, 1233న మారెబోయని కుమరుడు బయ్యని బొయ్యనబోయుడు తన తండ్రికి తల్లి కొమ్మసానికి తనకు పుణ్యం కావాలని ఆశిస్తూ దన్నాద మారెబోయిని కుమారుడు దామన బోయునికి దానం చేసిన సందర్భంగా వేయించిన శాసనం. దామనబోయుడు దానం స్వీకరించి దాన పాలన ఆచంద్రతారార్కం కొనసాగించాలని దానకర్త శాసన కట్టడి చేశారు. దానం చేసినవి 25 ఆవులు. దాన స్వీకర్త మల్లీశ్వరస్వామికి ప్రతినిత్యం మానెడు నెయ్యి అందజేయవలసి ఉంటుంది.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవరుషంబులు 1155 గు నేట్టి
ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున లామ
న మారెబోయని కొడ్కు బయ్యని బొయ్యన బోయు
ండు తమ తండ్రి మరెబోయినికి తమ తల్లి కొమ్మాసాన్కి తనకు
ధర్మార్థముగా దన యిచ్చిన మోదలు యిరువదేను వీని
ంజేకొని దన్నాద మారెబోయిని కొడ్కు దామన బో
యుండు దన పుత్రాను పౌత్రికము నిత్యమానె
ండు నెయి పోయం గలవాండు।

31

# 27. ఎఱ్ఱబోయుడు, మారెబోయుడు పాలుపటితి ఎఱ్ఱబోయుల శాసనము

ఎర్రబోయడు, మరెబోయుడు, పాలుపర్తి ఎర్రబోయుడు తన తండ్రి కాట్యబోయుడు, తల్లి అమరాసానికి పుణ్యం కలగాలని ఆశిస్తూ శక సంవత్సరం 1155 ఉత్తరాయణసంక్రాన్తినాడు అనగా క్రీ.శ. 1233 వేయించిన శాసనమిది. శిథిల మండప స్తంభంపైన ఇప్పుడు కనిపిస్తున్నది. మల్లీశ్వర మహాదేవరకు అఖండ దీపం కోసం అవసరమైన నెయ్యి ప్రతిరోజు మానెడు పంపించాలనీ, ఇలా పుత్రపౌత్ర పరంపరగా ఆ చంద్రతారార్కం కొనసాగించాలని దాన స్వీకర్తలను దాత ఆదేశించాడు. దానం స్వీకరించిన వ్యక్తులు బయ్యనబోయుని కుమారులు కన్నెబోయుడు బ్రమ్మనబోయుడు.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవ
రుషంబులు 1155 గు నేంటి ఉత్తరాయణ సంక్రా
ంత్తి నిమిత్త్యమున ఎఱ్ఱబోయుండు మరె బోయు
ండుం పాలుపటితి ఎఱ్ఱబోయుండు తమ తండ్రి కా
ట్యబోయునకుం దమ తల్లి అమరాసానికిం దమకు ధ
మ్మర్గంముగాను మల్లేశ్వర శ్రీ మహాదేవరకు అ
ఖండ దీపమునకు ఇచ్చిన మోదాలు 25 వీని
ంజేకొని చియ్యన బోయిని కొడ్కులు కన్నె బోయు
దును బ్రమ్మన బోయుండునుం దమ పుత్రానుపౌత్రిక
మున అచంద్రార్క్కము నిత్యమానెందు నేయివోయ
ం గలవారు।

## 28. లామనబోయుని శాసనము

ఇది తొమ్మిదిలైన్ల శాసనం. శిథిల మండపస్తంభంపైన వుంది. శక సంవత్సరం 1157న అనగ క్రీ.శ. 1235 సంవత్సరం నాటి దాన శాసనమిది. లామన బోయుడు అనే ఆసామి వేయించిన శిలా ప్రకటన. తన తండ్రికి, తల్లి కొమ్మసానికి పుణ్యం కావాలని మల్లీశ్వరస్వామిని ప్రార్థిస్తూ అఖండ దీపానికి అవసరమైన నెయ్యికోసం 25 ఆవులు దానం చేశాడు. దాన స్వీకర్త భీమబోయుని కుమారుడు బ్రమ్మబోయుడు దానం చేసిన సందర్భంగా వేయించిన శాసనమిది.

### శాసన పాఠం

---- శక వర్షంబులు 1157

గు నేణ్టి ---త్యమున లామ

న బోయుండు --- నాయినికి తమ తల్లి

కొమ్మాసాన్కిని తనకు ధమ్మ్రవుగా శ్రీమల్లేశ్వర శ్రీ

--- అఖండ దీపము

-----లు 25న వీనింజేకొని భీమ

బోయుని కొడుకు బ్రహ్మబోయుండు నిత్య

మానెండు నెయి ఆచంద్రాక్కంము నడపం గ

ల వాండు॥

## 29. విడ్వర్ల అమరనాయకుని శాసనము

శ.సం. 1158 ఫాల్గుణ శుద్ధ పాడ్యమి గురువారంనాడు విద్వర్ల అమరనాయకుడు వేయించిన శాసనం. ఇప్పుడు శిథిల మండపంపైన కనిపిస్తున్నది. మల్లీశ్వరస్వామికి అఖండదీపం ఎత్తించడం కోసం 25 ఆవులు దానంచేసిన సందర్భంలో వేయించిన శాసనం. దానగ్రహీత కీతెబోయుడు దానం చేసినది 25 ఆవులు. ప్రతి గ్రహీత మల్లీశ్వరస్వామికి నెయ్యి అందజెయ్యాలని దాత ఆశించాడు. ఈ 16 లైన్ల శాసనంలో ఆరంభం నుంచి పదవ పంక్తి వరకు ఈ ప్రశంస కనిపిస్తుంది. మధ్యలో అక్కడక్కడా అక్షరాలు పోయినాయి.

శాసనభావం: శుభకరమైన ఐదు 'మహా' శబ్దములను కైవశముచేసుకున్న (అస్పష్టం) దుర్జయ (జయింపనలవికానివారి) వంశమునకు అలంకారమైన, తిరుగజతి భట్టారకుల దివ్యమైన శ్రీపాదపద్మములను ఆరాధించు, శత్రువుల బలము (సైన్యము)ను సాధించునట్టి,

స్వామిద్రోహులవంశములకు యముడైన, యుద్ధమున భీముని వంటివాడైన, పరిపాలన పరశురాముడైన, శరణాగతుడైన జీవుల రక్షణచేసిన, యుగబాధలతో పోరాడిన, పరస్త్రీలకు దూరముగా ఉండు పరులకు మేలు చేయుటకై శరణుజొచ్చువారికి నారాయణుని వంటి వాడగు, వెలంకోటి మధ్వంశీయుడైన పవిత్ర సత్యనిపౌత్రుడు లేదా పుత్రుడు, చవుళ (చోళ) గాంగేయ, (గాంగులు) గొత్తంగోన, రాచగుడియ, గోపులమారి, పులియ, మార్కొలువ, కటమున్నెలువ మండలికులకు భయంకరులైన.

## శాసనపాఠం

స్వస్తి సమధిగత పంచ్చమహా శబ్ద, సా
మంత్త తురగ రేవంత్తనన్ని, దుర్జ్జయకుల విభూషణ,
దెలమదంలినశాన పెఱయతి గురజతి భట్టార దివ్య శ్రీపాదపద్మారాధ
క, పరబలసాధక, స్వామి ద్రోణ కులాత్తక సంగ్రామ భీమ, ప
పరిపాలన పరశురామ శరణాగత జీవ
రక్ష కృత, యుగ భాదారణ, పరనారీదూర ప
రహితాం శరణాగత నారాయణ వెలంకోటిమ
త్తాన్వయ, పవిత్ర సత్యని పోత్ర చవుళ గాంగేయ, గొత్తం
గోన రాచగుడియ గోపులమారి పులియ మా
ర్కొలువ కటకమున్నెలువ మండలిక ధూమగేతులై
న శ్రీమతు విద్పుల్ల అమరినాయకుండు శక వ
షంబులు 1158 గు నేట్టి పాల్గుణ శుద్ధ పాద్య
మి గురువారమున మల్లీశ్వర శ్రీ మహాదేవర
క ఖండ దీపమున కిచ్చిన మోదాలు 25 వీనిం జే కొ
ని గేతె బోయుండు తన పుత్రాను పౌత్రికము నిత్య
- - - - గలవాండు॥

## 30. పోతనయను విప్రుని వంశవర్ణనగల శాసనము

ఇదొక అసంపూర్ణశాసనం మొత్తం ఇరవై పంక్తులు ఉన్నాయి. చెక్కు చెదరలేదు. శక సంవత్సరం 1160న అనగా క్రీ.శ. 1238లో వేసిన శిలాప్రకటన. సంస్కృతంలో ఏడు శ్లోకాల్లో వేసిన శాసనమిది. అయితే శాసన కాలాన్ని పేర్కొన్న శ్లోకంలో సగం మాత్రమేవుంది. ఇది పోతన అనే బ్రాహ్మణుని వంశవర్ణనకు సంబంధించిన శాసనం. ఈ వంశీకులు కాశ్యప గోత్రజులు. సచ్చరిత్రగలవారు. ఈ శాసనంలో ఎర్రమ రాజు ముఖ్యుడని వుంది. మార నామాధిధేయ నాగరాజు. దేవనమంత్రి ప్రశంసవుంది. క్రీ.శ. 1238లో వేసిన ఈ శాసన పాఠం.

### శాసనభావం

1. శుభమైన శ్రీ మహావిష్ణువుయొక్క నాభిపంకజమున పుట్టిన బ్రహ్మ ముఖము నుండి పుట్టినవారి (బ్రాహ్మణులు) కులమున లోకమునకు అలంకారము వంటివాడైన 'పోతిన' అను బ్రాహ్మణశ్రేష్ఠుడు జన్మించెను.

2. అనేకులైన పండితులకు నిలయమైన పాసుదోవ అగ్రహారమున విస్తరించిన కార్యకలాపములతో పేరొందినవాడు, కశ్యసప గోత్రమున పుట్టినవాడు. యాచకులకు పారిజాతము (కల్పవృక్షము) దుఃఖితులకు సుఖమొసంగు అర్హులు, మంచి ప్రవర్తన కలవారు. పవిత్రులు, మంచివారికి ఉపకారము చేయుటయే భాగ్యఫలము భావించువాడు..

3. మహేశ్వరునివంటి ఈశ్వరుడను కుమారుడతనికి కలిగెను. నీతియందతనికి సాటియగువారెవ్వరు లేరు. పాపమునకు కారణమైన అజ్ఞానమును తొలగించుటయందు నేర్పరి. ఉత్తమమైన భోగముల కలవాడు, ధరించిన భస్మాంలంకారము కలవాడు లేదా ఐశ్వర్య సూచకములైన అలంకారములను ధరించినవాడు.

4. కశ్యపుని వంటి అతనికి ఎల్లమ అను మహిళారత్నమందు 'విష్ణువు' అను సుపుత్రులలో ఉత్తముడు జన్మించెను. అతడు మంచివారి కోర్కెలు తీర్చువాడు. ఎల్లప్పుడు సత్యమందు అనురాగము కలవాడు. నరకమును పోల్చుటకు వీలుపడని ప్రతాపముతో నశింపచేసుకున్న వాడు. స్మరించిన మాత్రమున పాపములను తొలగింపచేయువాడు (పుణ్యస్మరణీయుడు)

5. శ్రీకృష్ణునకు రుక్మిణియందు మన్మథుడు జన్మించినట్లు అందరినీ రంజింపచేయువాడై రెండు వంశములకు అలంకారుడై విష్ణువనుపేర సుపుత్రుడై వినయము, నీతి, నేర్పు దయలతో గొప్పవాడై మారన అని పిలువబడుచు, రాజు మొదలగువారిచే తల్లివలె నాదరించబడునామెకు (రాజముఖ్యాంబికకు) కలిగెను (జన్మించెను).

6. శ్రీ నాగదేవమహారాజు మంచితనమునకు పాత్రమైన మంత్రిత్వమును పొందెను. అతని తమ్ముడు దేవన మంత్రివర్యుడనేక మంది రాజులచే సత్కరించబడెను.

7. మారయ దేవసేనలకు మంత్రిముఖ్యులు కశ్యవంశ విస్తారకులై, గుణనిధులై ఈ

లోకమున ప్రకాశించిరి.

**8. వ్యోమ ఋతు ఈశ్వర. 1160= 1160 శక సంవత్సరమున సూర్య గ్రహణ కాలమున అమావాస్య దినమున.**

## శాసన పాఠం

స్వస్తిశ్రీ లక్ష్మీబృద్నాభిజాంభోజ భువో ముఖభువాం కు
లే పోతనాభిధో విప్రేంద్రః ప్రభూద్భువన భూషణః(1)
వివిధలుధని ధానే పాసుదోవాగ్ర హారే ప్రతిత పృధుల ప్రిత్తి
గోత్రజ కశ్యపస్య। నఖిత సుఖపాత్ర స్వచ్చరిత్రైః పవి
త్ర స్సదుపక్రితి ఫల శ్రీరర్థినాం పారిజాతః (2) తస్యేశ్వ
రో నామ మహేశ్వరాభస్సూసున్నయే నా సమచక్షురాసీత్
పాపాంధకధ్వంస విధౌపటియా నహీన భోగీ భృత భూతి భూషః
(3) తస్మాత్కశ్యప సన్నిభా దుదుభవ ద్విష్ణుస్సుపుత్రోత్తమః శ్రీ
మానెల్లమ నామధేయ వనితారత్నే దితి స్సద్ధిస్సు నివిష్ణ్యా భస్సు
మనో మనోరథ కరస్సత్యాను రాగోస్వహం ప్రధ్వస్తాప్రతి
మ ప్రతాప నరకః క్షీణాఘు సంకీర్తినః (4)రతిపతరి
వ విష్ణో రుక్మిణీ వల్లభాయా ముదభవదభి రామో రాజ
ముఖ్యాంబికాయాం వుభయకులలలామో విష్ణునామ్నా సుపు
త్రో వినయనయదయాఢ్యో మారనాభి దేయః (5) శ్రీనాగ
దేవక్షితి పాలమౌలే స్సన్మంత్రి భావం భజతస్సనాభిః
తస్యానుజో దేవన మంత్రివర్య్యస్సమ్మా నితానేక వనీవకో
భూత్ (6) సుధారరే కశ్యప వంశ వార్ధిన్నిధిర్గుణానామధు
నావలీనాం। కల్పాంఘ్రి పౌ మారయ దేవనాఖ్యవమాత్యము
ఖ్యా భువనే విభాతః (7) వ్యోమర్త్తీశ్వర 1160 మేయ శాక
శరదస్సూ య్యోపరాగే సహామాసేదర్శదివే॥

(అసంపూర్ణము)

# 31. లావెనబ్రహ్మనబోయుని శాసనము

శిథిల మండప స్తంభం పైన ఆరు లైన్లలో వేసిన శాసనమిది. శక సంవత్సరం 1161 పుష్యశుద్ధ పౌర్ణమి సోమవారం అనగా క్రీ.శ. 1289లో ఉత్తరాయణ సంక్రాన్తి నిమిత్తం లావన బ్రమ్మన బోయదు తన కుమారుడు వేమనబోయునికి సద్గతులు కలగాలని కోరుతూ మల్లీశ్వరస్వామికి అఖండదీపం ఎత్తించే సందర్భంలో వేయించిన శాసనం స్వామికి నిత్యం మానెడు. నెయ్యి ఇవ్వాలనీ, ఇలా ఆచంద్రతారార్కం జరగాలని ఆశిస్తూ కామెబోయుని కుమారుడు కంటిప్రోలె బోయుడికి 25 ఆవులు దానం చేశాడు. ఇది ఈ సందర్భంగా వేయించిన శాసనం.

## శాసన పాఠం

స్వస్తి శ్రీ సకవర్షంబులు 1161 అగు

నేటి పౌష్య సుద్ధ పంచదసియు సోమవారమునాండు ఉత్తరాయన సంక్రాంతి నిమిత్యము

న లావెన బ్రమన బోయుండు తన కొడ్కు వేమనబోయునకి ధర్మ్ముగావుగా విజయువా

డ మల్లేశ్వర మహా దేవరకు అఖండ దీపమునకుం ఇచ్చిన మోదాలు 25 వీనిం జేకొని

కామె

బోయిని కొడ్కు కంటప్రోల బోయుండు తన పుత్రాను పౌత్రికమున నిత్య మాన్యెందు నెయి

వాండు॥

# 32. ఎనుమందలి నడ్విరెడ్డి శాసనము

ఇది శిథిల మండప స్తంభంపైన గల నాలుగు లైన్ల శాసనం. ప్రతి లైనులోను అక్షరాలు చెరిగిపోయాయి. అయితే భావస్ఫురణమాత్రం సాధ్యం. శ.స. 1162 వైశాఖ శుద్ధ పాడ్యమి.. సంక్రాన్తి నిమిత్తం ఎనమదల నడ్సిరెడ్డి తన తండ్రి కొమ్మిరెడ్డి తల్లి సూరసాని పుణ్యం కోసం మల్లీశ్వరస్వామికి ఆవులు దానం చేసిన సందర్భంగా వేయించిన శాసనం. దాన ప్రతిగ్రహీత మారెబోయుని కుమారుడు మండెబోయుడు శాసనకాలం క్రీ.శ. 1240

## శాసనపాఠం

1. స్వస్తి ।శ్రీ సకవర్షఁబులు 1162 నేంటి వైశాఖ శుద్ధ పాడిమి --- - సంక్రాతి ని

2. మిత్యమున విజాయువాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు ఎనమందుల నడిపిరెడ్డి తమ --- కొమ్మిరెడ్డి

3. కి తమ తల్లి సురసానికి తమ్మ అన్న ప్రోలిరెడ్డికి దమ్మఁవుగా దీపమునకిచ్చిన మోదలు --- వీనింజేకొని--

4. క్క ఁమున నిత్యం మానెందు నెయి నడపంగలవా --- సదము మారేబోయుని కొడ్కు మండెబోయుడు దన పుత్రానుపౌవిత్రికము ఆచంద్ర

(క్ర్కఁము నిత్యం మానెండు నియి నడపగలవా ---)

# 33. ఎన్మందలి నడ్విరెడ్డి శాసనము

ఇది శిథిల మండప స్తంభంపైన వేయించిన శాసనం, శాసనకాలం భాగం అక్షరాలు పోయినాయి. శాసనకర్త ఎనమదల నడిపిరెడ్డి, తన తండ్రి సూరసాని అన్న ప్రోలిరెడ్డిలకు సద్గతులు కలగాలని ఆశిస్తూ విష్ణుసంక్రాన్తినాడు వేంత మల్లిరెడ్డికి 25 ఆవులు దానం చేశాడు. ప్రతి గ్రహీత వంశపారం పర్యంగా మల్లీశ్వరస్వామికి ప్రతినిత్యం మానెడు నెయ్యి పొయ్యాలని దాత ఆశించాడు.

## శాసనపాఠం

శకవర్షఁబు 116 - -

గు విషునాండు యెన్మందల నడ్విరెడ్డి తమ తండ్రికి తమ త

ల్లి సూరసాన్కిం దమ అన్న పోలిరడికి ధమ్ముఁవుగా మల్లేశ్వర శ్రీ మ

హాదేవరకు అఖండ దీపానకు నిచ్చిన మోదాలు 25 వీనిం

జేకొని లేంత మార్లెబోయుండు తన పుత్రాను ప

విత్రము నిత్య మానెందు నెయి నడ్పంగల వాడు॥

## 34. గొంటూరి పరువల మల్లిశెట్టి శాసనము

**ఈ నాలుగు లైన్ల శాసనంలో మొదటి రెండు లైన్లు సంస్కృతంలలో ఉన్నాయి. మొదటిలైనులో కొన్ని అక్షరాలు చెదిరిపోయినాయి. శాసనకాలం శా.స. 1168 సరియైన క్రీ.శ. 1241 శివరాత్రి పర్వదినం సందర్భంగా మల్లీశ్వరస్వామికి పరువల మల్లిసెట్టి అఖండదీపం కోసం 25 ఆవులు దానంచేశాడు. దానగ్రహీతలు రామనబోయుని కొడుకు మానెబోయుడు, ముత్తెబోయుడు ప్రతినిత్యం స్వామికి మానెడు నెయ్యి పొయ్యాలని శాసన కట్టడి చేశాడు.**

### శాసనభావం

**శ్రీ మహావిష్ణువు నాభికమలమున పుట్టిన బ్రహ్మయొక్క తొడల నుండి పుట్టిన వైశ్య కులస్థుడు, మొదటగా లెక్కించదగిన ఐశ్వర్యముతో వచ్చినవాడు (అస్పష్టము) పరావా వంశమున సత్పుత్రుడు, విస్తరించిన కీర్తికలవాడు భూమాంబిక కుమారుడు.**

### శాసనపాఠం

శ్రీకాంతాధిప నాభీసరోజ సంభవోరూద్భూత వైశ్యాన్వయః దురిభూత్యాయాత - - వ -

- నా- -

(ఐమ్మదువనాఖ్యః సూను రాసీత్తతః) పరావాన్వాహ్వయ సత్సుతః పృథుయ

శోభూమాంబికా నందనః శతాబ్దములు 1163 నేంటి శివరాత్రినాం

డు పెనుగొండ శాసనుందు పెంటికుల గోత్రుండు గొంటూరి పరువల మల్లిసెట్టి

మల్లీశ్వర మహాదేవరకు అఖండ దీపాని కిచ్చిన మోదాలు 25 వీనిం జే

కొని రామన బోని కొడ్కులు మానెబోయుందును ముత్తెబోయుందుం బుత్ర పౌత్రక్రమాన

నిత్య మానెందు నేతి పడి నడపువారు॥

# 35. గొంటూరి నాగదేవరాజు సమస్తసేనాపతి పోతనామాత్యుని శాసనము

ఈ శాసనం క్రీస్తుశకం 1242లో అప్పటి బెజవాడ ప్రాంతం మహామండలేశ్వరుడు గొంటూరి నాగదేవరాజు దగ్గర సేనాధిపతిగా పనిచేసిన పోతనామాత్యుడు వేయించినది. పోతనామాత్యుడు చికిత్సగోత్రుడు. తండ్రి చెన్ననామాత్యుడు. తల్లి వెన్నమాంబ. పోతన అపారమైన బంధుప్రేమ గలవాడు. పోతన బెజవాడ మల్లీశ్వర మహాదేవర భక్తుడు. స్వామికి అఖండ దీపాలు ఎత్తించడం కోసం అవసరమైన 50 ఆవులు దానం చేశాడు. దాసబోని సూరెబోయడు, గోపాల ముద్దిబోయుడుగాన స్వీకర్తలు. దానం స్వీకరించిన వీరిరువురు ప్రతిరోజు స్వామికి నిత్యం మానెడు నెయ్యి పోయగలరని ధాత నిర్ణయించాడు. కేవలం ఆవును మాత్రమే దానం చెయ్యలేదు. నేటి కేసరపల్లిలో ఒక ఖండ్రిక, బల్లిప్రోలులో ఒక ఖండ్రిక భూమిని కూడా దానం చేశాడు. ఈ శాసనంలో కొన్ని పంక్తులు చెరిగిపోయినాయి. అక్కన్నమాదన్న గుహల వద్దగల శిథిల కనకదుర్గ మండపంలోని స్తంభంపైన చెక్కిన శాసనమిది. మొత్తం ఏడు పంక్తులు కనిపిస్తాయి.

## శాసనపాఠం

1. స్వస్తిశ్రీ శకవర్షంబులు 1164గు నేంటి భాద్ర .........

2. ... రి నాగదేవరాజులకు సమస&త సేనాధిపతియునుం గోపి - ప శాసనాధీశ్వరుండును చికిత్స గోత్రుండ్డును చెన్న నామా

3. త్య పుత్రుండ్డును వెంన్న మాంబికా వరతనూజుండును నైన పోతనామాత్యుండ్డు

4. మల్లీశ్వర శ్రీ మహాదేవునికి నఖండ్డ దీపములు రెంట్టికి నిచ్చిన మోదాలు 50. వీనిం జేకొని దానబోని సూరెబోయుండును

5. గోపాల ముద్దిబోయుండుం దమ పుత్రపౌత్రాన క్రమాన నిత్య మానెందు నేసి చమురు నడపంగల వారు। వీరి కన

6. రిపల్లి ఖ1 బల్లి

7. ప్రోలూర ఖ 1.

## 36. పోతనబోయుని శాసనము

ఇ దొక అసంపూర్ణ శాసనం. ఎందుకు అర్థంతరంగా శాసనం ఆగిపోయిందో చెప్పలేము. ఇదికూడా అక్కన్నమాదన్న గుహల సముదాయంలోగల శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వుంది. నాలుగు లైన్ల శాసనమిది. ఇది కూడా క్రీ.శ. 1242 వేయించినదే! తల్లి ముతసాని, తండ్రి ముతలకు సద్గతులు కలగాలని ఆశిస్తూ వేయించాడు.

### శాసనపాఠం

1. స్వస్తి। శ
2. క వర్షంబులు 1165 గు విషువు సంక్రాంతి నిమిత్యము
3. న మల్లీశ్వర దేవరకు పోతనబోయుండు త
4. మ తల్లి ముత్తసన్కి తండ్రి ముత.

## 37. తమ్మునారి శాసనము

ఇది సాహిత్య ప్రాధాన్యతగల పద్యశాసనం. ఎవరు దీనిని ఎత్తించింది తెలియదు. తెలుసుకొనే ఆధారం కూడా లేదు. శిథిల కనకదుర్గ మండపంలోని స్తంభంపై ఆరు పంక్తులలో చెక్కబడి వుంది. తమ్మునారి అనే మండలేశ్వరుడిని ఆశీర్వదిస్తూ, వేయించిన శాసనం ఇది. ఈయన పరాంగన కుమారుడు. ఇక్కడ పరాంగన అన్నది వ్యక్తినామంగా కనిపిస్తున్నది. బలిచక్రవర్తి వలె సూర్యచంద్రులు ఉన్నంతకాలం రాజ్యమేలాలని శాసనకవి ఆశీర్వదించాడు. ఇందులో ఇంతకంటె మించి సమాచారం లభ్యం కావడం లేదు.

### శాసన పాఠం

1. దాత్రి లసత్కవీంద్రుల విపశ్చిదనీకముం బ్రోచి నీతిచే
2. యీ ధాత్రికి నెంత్తయేనియు ముదంబొనరించ్చి
3. న యీ పరాంగనా పుత్రుండు దమ్మునారిబలిం బో
4. లి మహీతల మేలుంగాపుతను ధాత్రి యుం నబ్జ
5. మిత్రుండు సుధాకరుండుం గ్గలయంన్తక్కాలము
6. ను॥

# 38. వరివేడిపోతరాజు శాసనం

ఇది కూడా శిథిల మండపంలోని శిలాస్తంభంపైన గల శాసనమే! 19 పంక్తులుగల శాసనం. క్రీ.శ. 1243లో అనగా శకవర్షం 1165 కార్తిక పౌర్ణమావస్యనాడు తులాసంక్రాన్తినాడు కాస్యపగోత్రుడైన వరివేడి పోతరాజు తన తండ్రి పోతరాజు, తల్లి ఎరుకసాని పుణ్యంకోసం బెజవాద మల్లీశ్వరస్వామికి ప్రతిరోజు మానెడు నేతితో దీపారాధన చేయించాలని తలచాడు. అందుకోసం ఎరమాయని కొడుకులు మారెబోయుడు, భీమనబోయులకు పదమూడు కొడుకులు మారెబోయుడు. భీమనబోయులకు పదమూడు ఆవులు దానం చేశాడు. వీరిరువురు పుత్రపౌత్ర పారంపర్యంగా ఈ దానం కొనసాగించాలని దాత ఆశించాడు.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ షక వర్షంబులు
1165గు నేంటి కార్తిక
పౌర్ణమావాస్యతూల సంక్రా
ంత్తి నిమిత్యముగా వరివేడి
పోతరాజు కాస్యపగోత్రుండు
తమంతండ్రి భీమరాజు
నకుందమతలి ఎఱకిసన్కి
ధర్మార్థముగా బెజవా
డ మల్లీశ్వర శ్రీ మహా
దేవరకు అరెదీపా
నకు నిచ్చిన మోదా
లు 13 వీనింజేకొని
ఎఱమారెబోయిని కొడ్కు
మారెబోయుండు
ను భీమనబోయు
ందును తమ పు
త్రాను పౌత్రికము
నిత్య తవ్వెండు నెయి
నడపంగలవాడు.

# 39. మనుమరాజు శాసనం-1

ఇది కూడా తల్లితండ్రులకు పద్గతులు కలగాలని ఆశిస్తూ క్రీ.శ. 1242లో వేయించిన శాసనమే.! ఆ సంవత్సరం విష్ణు సంక్రాన్తినాడు మనుమరాజు తన తల్లి నరెషుదేవి, తండ్రి పేరరాజుల పుణ్యంకోసం మల్లీశ్వర మహాదేవరకు అఖండదీపం ఎత్తించాలని సంకల్పించాడు. అందుకు ప్రతినిత్యం దాన ప్రతిగ్రహీత స్వామికి మానెదు నెయ్యి అందజెయ్యాలి. ఇందుకోసం ప్రతి గ్రహీత నల్లంగెతెబోయుడికి దాత మనుమరాజు 55 గొర్రెలు దానం చేశాడు.

## శాసన పాఠం

శ్రీ స్వస్తిశ్రీ శకవర్ష

ంబులు 1165గు విషు

వు సంక్రంత్తి నిమి

త్యమున మనుమర

జు తలి నరెమదేవ్వు

లకు తండ్రి పేరపరా[illegible]

కు ధమ్మార్థగా మల్లీశ్వ

ర మహాదేవునికి అ

ఖండ దీపమ[illegible] ఇంచ్చి

న గొఱ్ఱెలు 55 వీని

ం జేకొని నల్లంగేతె

బోయుండు తన పు

త్రాను పౌత్రికమున

నిత్యే మానెండు నె

యి పోయంగలవాం

డు॥

## 40. మనుమరాజు శాసనం-2

ఎందువల్లనో ఒకే శాసనం రెండుచోట్ల కనిపిస్తున్నది. శాసన సారంలోగాని, రచన ప్రణాళికలోగాని రవ్వంత కూడా తేడా కనిపించని ఈ శాసనం ఇంద్రకీలాద్రి పాద సమీప శిథిల కనకదుర్గ మండపంలోని స్తంభంపైన కనిపిస్తున్నది. మొత్తం పదహారు లైన్ల శాసనమిది.

### శాసనం

శ్రీ స్వస్తిశ్రీ శకవర్ష
ంబులు 1165గు విషు
వు సంక్రాంత్తి నిమి
త్యమున మనుమరా
జు తలి నరెమదేవు
లకు తండ్రి పేరపరజున
కు ధమ్మా౯గా మల్లేశ్వ
ర మహాదేవునికి అ
ఖండ దీపమునకు ఇంచ్చి
న గొత్తెలు 55 వీని
ం జేకొని నల్లంగేతె
దోయుందు తన పు
త్రాను పౌత్రికమున
నిత్య మనెందు నె
యి బోయంగల వ (రు)

# 41. మహామండలేశ్వర ముప్పలదేవి కరణము కేతరాజు శాసనము

**శ**కవర్షం 1168లో అనగా క్రీ.శ. 1246లో మహామండలేశ్వర ముప్పలమహాదేవి కరణము కేతరాజు మల్లీశ్వర మహాదేవరకు అఖండదీపం ఎత్తించడం కోసం అవసరమైన ఆవులు దానం చేశాడు. దానగ్రహీత నోచిండ్లపాడు కాపురస్తుదు మారెబోయుదు ఈ అసంపూర్ణ శాసనం శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వుంది. శాసన పంక్తులలోని చివరి అక్షరాలు చెడిపోయినాయి.

## శాసనపాఠం

శ్రీ స్వస్తిశ్రీ సక వర్షంబులు 1168 గు నేం...
ద్రపద బహుల దశిమియు గురువార....
న స్వస్తిశ్రీ మన్మహా మండలేశ్వర...
ప&పలప మహాదేవి కరణము కేతరాజు...
జయవాడ మల్లీశ్వర శ్రీ మన్మహాదేవ...
అఖండ దీపమునకు నిచ్చిన మోదా....
వీనింజేకొని నొంచిడ్లపాటి....
యిని మారెబోయుందు ఆచంద్రా

## 42. పినమల్లారి ముత్తిరెడ్డి కొడుకు అన్నపరెడ్డి శాసనము

ఈ శాసనం కూడా శిథిల కనకదుర్గ మండప స్తంభం పైనే కనిపిస్తున్నది. శక సంవత్సరం 1175 మాఘ బహుళ అమావాస్య బుధవారంనాడు పినమల్లారి ముత్తిరెడ్డి కుమారుడు అన్నపరెడ్డి వేయించిన శాసనమిది. బెజవాడ మల్లీశ్వర మహాదేవర అఖండ దీపానికి 25 ఆవులు ఇచ్చే సందర్భంలో వేయించిన శాసనమిది. దాన స్వీకర్త పరువలిబోయుడు. ప్రతిగ్రహీత ప్రతినిత్యం స్వామికి మానెడు నెయ్యి పోయాలన్నది దాత అభిమతం. క్రీ.శ. 1253లో వేయించిన శాసనం.

### శాసన పాఠం

స్వస్తి। శ్రీ శకవ
షంబులు 1175
గు నేంటి మాఘ
బహుల 15
బుధవారానం
పినమల్లారి ము
త్తిరెడ్డి కొడుకు
అన్నపరెడ్డి బె
జవాడ మల్లే
శ్వర మహాదే
వరకు అఖ
ండదీపము
న కిచ్చిన మోదా
లు 25 వీనిం జే
కొని పరువల మలబో
ండు నిత్యమానెం
డు నెయి బోయం గ
లవాండు॥

## 43. సూరెబోయుని శాసనము

ఇదొక అసంపూర్ణ శాసనం. మొత్తం ఆరు లైన్లు ఉన్నప్పటికి దానలక్ష్యం, దాన వివరాలు స్పష్టంగానే వున్నాయి. వాక్య నిర్మాణం నిర్దుష్టంగా కనిపిస్తున్నది. ఇవి కూడా శిథిల కనకదుర్గ మండపస్తంభంపైన వుంది. శకవర్షం 1176లో వేయించినది. అనగా క్రీ.శ. 1254లో వేయించిన శాసనం. ఆ సంవత్సరం విష్ణుసంక్రాన్తినాడు మల్లీశ్వర మహాదేవరకు 25 ఆవులు దానం ఇచ్చే సందర్భంగా వేయించిన శాసనమిది.

### శాసన పాఠం

స్వస్తి। సకల గుణాలంక్రితుండైన శ్రీమ
న్మహా మండలిక గొంటూరి నాగదేవనికి ఎరువధ్యక్షుండు
ను వెల్లలచేటి శాసనుండును మల్లెబోనికి సురసన్కి సుపు
త్రుండైన వీటి భాగము సూరెబోయుండు 1176 నే
ంటి విషుసంక్రాంత్తి మొదలుగా మల్లీశ్వర మహా
దేవరకు నిచ్చిన మోదాలు 25 వీనింజేకొని

(అసంపూర్తి శాసనము)

## 44. కేతినాయుని శాసనము

శక సంవత్సరం 1177లో అనగా క్రీ.శ. 1255లో నాదిండ్ల కేతినాయుడు తన తల్లితండ్రులైన యెరుకసాని, తండ్రి భీమనేనినిక సద్గతులు కలగాలని ఆశిస్తూ వేయించిన శాసనం. శిథిల మండప స్తంభంపైన గల శాసనమిది. మల్లీశ్వరుని అర్చనకు ప్రతిరోజు మానెడు నెయ్యి అందజెయ్యాలని దానగ్రహీతను ఆదేశించాడు. దాన స్వీకర్త యెడిద ఎర్రబోయుడు.

### శాసన పాఠం

శకవర్షంబులు 1177 గు
నేండు నాదిండ్ల కేతినాయుండు
తమ తండ్రి భీమినేన్కిం దమ తల్లి
యఱకాసాన్నిధమ్ముంవుగా మల్లేశ్వ
ర శ్రీ మహాదేవరకు అఖండదీప
మునకు నిచిన మోదాలు 25 వీనిం
జేకొని యెయెదడి ఱబోయుని
చింత్యెబోయుండు నిత్య మానె
ండు నెయి నదపంగలవారు

# 45. సూరపరాజు శాసనము

ఇది మల్లీశ్వరస్వామి ఆలయం ముందుగల మండపానికి అమర్చబడిన రాతిమీద 26 పంక్తులతో చెక్కబడిన శాసనం. మొదటి 12 పంక్తులు చెదరిపోయినాయి. మిగిలిన 12 లైన్లు కనిపిస్తున్నాయి. శక సంవత్సరం 1179లో వేయించిన శాసనం. అనగా క్రీ.శ. 1257 నాటిది. దానకర్త సూరపరాజు తన అభీష్ట సాధనకు తన తండ్రి, రమదేవికి సద్గతులు కలగాలని ఆశిస్తూ మల్లీశ్వరుని అర్చనకోసం నెయ్యి ఇవ్వాలని సూరపరాజు సంకల్పించాడు. అందుకోసం ఎర్రాబోని కుమారుడు మారబోయునికి 25 ఆవులు దానం చేశాడు. మారబోయుడు ప్రతి నిత్యంస్వామికి మానెడు నెయ్యి ఇవ్వాలి. ఈ దానపాలన పుత్రపౌత్ర పారపర్యంగా సాగాలని ఆదేశించాడు.

## శాసన పాఠం

-13 పంక్తులు చెదరిపోయినవి
సూరపరాజులు తనకు-
వరసిద్ధిగా స్వస్తిశ్రీ సకవర్షము
లు 1179 దగు నేంటి విషువు సం
క్రాంతినాండు తమ తండ్రి-
రాజులకూను తమ త-
రమదేవులకూను ధర్మార్థ
ముగా విజయవాడ మల్లీశ్వర
శ్రీ మహాదేవరకు అకాండ దీపా
నకు ఇచ్చిన మోదాలు 25 వీనిం జే
కొని ఎఱ్ఱాబోని కొడ్కు మార
బోండు తన పుత్రాను పౌత్రికము
యాచంద్రార్క్కముగా నిత్యమానె
నెయి నడపం గాలవాండూ॥

# 46. మారిరెడ్డి శాసనము

ఇది పదిహేడు పంక్తులుగల శాసనం. అక్కన్నమాదన్న గుహల సముదాయంలోగల కనకదుర్గ శిథిల మండప స్తంభం పైనగల శాసనం. శకవర్షం **1183లో**, అనగా **1261లో** వేయించిన శాసనం. శాసనకర్త నందిగామ మారిరెడ్డి తండ్రి మారిరెడ్డి. ఆ సంవత్సరం ఉత్తరాయణ సంక్రాన్తినాడు మల్లీశ్వరస్వామికి 55 గొర్రెలు దానం చేశాడు. దాన స్వీకర్తలు పెద్దిగొమ్ము శీతెబోని కొడుకులు మల్లేన, దామన ప్రతిరోజు స్వామికి మానెడు నెయ్యి అందజెయ్యాలని దాత ఆశిస్తూ ఈ దానం చేశాడు. అంతేకాదు దానగ్రహీతలు పుత్రపౌత్రపారం పర్యంగా ఈ సేవ కొనసాగించాలని కూడా దాత ఆశించాడు.

## శాసన పాఠం

స్వస్తి శ్రీ। సకవర్షం
ంబులు 1183 గు నే
ంటి యుత్తరాఅన సం
క్రాంత్తి నిమిత్త్యమున
మల్లీశ్వర శ్రీమహా
దేవరకు లోకతి న
ందిగామ బొల్లిరడ్డి
కొడ్కు మారిరడ్డి అ
ఖండ్డదీపనకు
నిచ్చిన ఇన్నుఎడ్లు 55
వీనింజేకొని పెద్దిగొమ్ము శీ
తెబోని కొడ్కు మల్లెన
దామనలు దమ పుత్రాను
పౌత్రికము నాచంద్రా
ర్క్కము నిత్యమానెం
డు నెయిపోయంగల
వారు ॥ శ్రీ॥

# 47. మీనబ్రహ్మబోయుని శాసనము

మల్లీశ్వరాలయం తూర్పుద్వారానికి కుడివైపున గల శిలపై చెక్కిన శాసనమిది. శక సంవత్సరం **1186**లో వేయించారు. మీనబ్రహ్మబోయుడు స్వామికి దీపారాధన నిమిత్తం **25** ఆవులు దానమిచ్చే విషయం ఇందులో వుంది. క్రీ.శ. **1264**లో వేయించిన ఈ శాసనం మల్లీశ్వరస్వామికి అవసరమైన నెయ్యి దాన స్వీకర్త నాచన బోయుని కుమారుడు ప్రోలెబోయుడు దానం స్వీకరించాలని దాత నిర్దేశించాడు. ఈ శాసనంలో **11** నుంచి **15** లైన్లుగల అక్షరాలు చెదిరిపోయాయి.

## శాసనపాఠం

స్వస్తిశ్రీ శకవర్ష
ంబు 1186 గు
నేండు మీస బ్రమన
బోయుండు మల్లే
శ్వర శ్రీ మహాదే
వరకు దీపానకు ని
చిన మోదాలు 25
వీనిం జేకొని నాచన
బోయుని కొడ్కు కు
ప్రోలెబోయుండు
- - - ను సూరె
- - - కొమ్మన
- - - నిత్యమా
- - -పోయంగల
- - -మ పుత్రా-
(తక్కిన శిలాశాసనము విరిగిపోయినది)

## 48. వలంగలేటి అన్నపనేని శాసనము

ఇది 8 లైన్లుగల శాసనం. మల్లీశ్వరస్వామి ఆలయంలో గల విఘ్నేశ్వరాలయం కప్పుపై అమర్చబడిన శిలమీదగల శాసనం. శాసనకాలం శక సంవత్సరం 1191. ఆ ఏడాది జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి సోమవారం వలంగలేటి అన్నపనేడు తన తల్లిదండ్రుల ధర్మార్థంగా మల్లీశ్వర మహాదేవరకు అఖండ దీపం ఎత్తించదలచి ఆ దీపారాధనకు అవసరమైన నెయ్యికోసం 25 ఆవులు దానం చేశాడు. ఆ సందర్భంలో వేయించిన శాసనమిది. దానగ్రహీత కాలెబోయుని కుమారుడు లోకెబోయుడు. ఎనిమిదవ లైను తరువాత శాసన శిల పగిలిపోయింది. శాసన కాలం క్రీ.శ. 1269.

### శాసన పాఠం

శ్రీ స్వస్తి। శ్రీ శకవర్షంబులు 1191
గు నేంటి జేష్ఠ శుద్ధ 11 సో। వారా
న బెజవాడ మల్లీశ్వర శ్రీ మ
హా దేవరకు వలంగలేటి అన్న
పనేండు తమ తల్లిదండ్రులకు ధ
మ్ముపుగా నఖండ దీపానకు నిచ్చి
వ మో 25 వీనిం జేకొని కాలెబోయి
ని కొడ్కు లోకెబోయుండు ఈ

## 49. నిమ్మనాయకుని శాసనం

శాలివాహన శకం 1191 మాఘ బహుళ అమావస్య శుక్రవారంనాడు అనగా క్రీ.శ. 1269న నిమ్మనాయకుడు తనకుమార్తె పత్రాచాపస పుణ్యం కోసం మల్లీశ్వర మహాదేవరకు దానమిచ్చిన విషయం ఈ శాసనంలో వుంది. ఇది ఎనిమిది లైన్లలో చెక్కబడిన శాసనం. మల్లీశ్వరాలయం ముందుగల మండపం పై కప్పులకు అమర్చబడిన రాతిపై శాసనం చెక్కారు. దానగ్రహీత శీలమకేతిబోయడు నిత్యం మానెడు నెయ్యి మల్లీశ్వరస్వామికి అందజెయ్యాలని నిర్దేశించడమే గాక ఈ దానపాలన శీలమకేతి బోయుడు పుత్రపౌత్రపారంపర్యంగా కొనసాగించాలని దానకర్త ఆదేశించాడు.

### శాసన పాఠం

స్వస్తి। శ్రీ శకవర్షంబ్బులు శ్రీ
1191 నేంటి మాఘబహుల 15
శుక్రవారాన నిమ్మనా... కుని తంన
కుంత్తుఋ పత్రాచాసపకుం పునెము
కాను మల్లీస్వర శ్రీమహాదేవర దీవ
లకు శీలమ కేతిబోయుండు తన
పుత్రాను పౌత్రికము నిత్య సోలె
ండు నెయి నడపం గలవాండు॥

## 50. ఊడపరెడ్డి కొడుకులు మల్లిరెడ్డి, ప్రోలిరెడ్ల శాసనము

శక సంవత్సరము 1193 ప్రజాపతి సంవత్సరం భాద్రపద బహుళ అమావస్య శనివారంనాడు సూర్యగ్రహణం వచ్చింది. అనగా అది క్రీ.శ. 1271 గ్రహనం సందర్భంగా ఊడపరెడ్డి కుమారులు మల్రెడ్డి, ప్రోలిరెడ్డి తమ తల్లిదండ్రుల పుణ్యం కోసం 25 ఆవులు మల్లీశ్వర స్వామికి అఖండ దీపం ఎత్తించే లక్ష్యంతో వేయించిన శాసనం. దానగ్రహీతలు కాంపెబోయుని కుమారులు గంగన బోయుడు, కొమ్మనబోయుడులకు ఊడపరెడ్డిపల్లి గ్రామంలోని గుడిముందు ఒక మర్తురు నీర నేల ఇస్తున్నట్టు దాతలు ప్రకటించారు. బెజవాడ మల్లీశ్వరస్వామికి ప్రతినిత్యం మానెడు నెయ్యి ఇవ్వాలనీ, పుత్రపౌత్ర పరంపరగా ఈ ధర్మం నిర్వర్తించాలని దానకర్త నిర్దేశించాడు.

## శాసన పాఠం

స్వస్తిశ్రీ శా
క వర్షంబులు 119
3 నేంటి ప్రజాపతి సంవ
త్సర భద్రపద బహ 15
వద్దవరాన స్యుర్యగ్ర
హణము నందు ఊడప
రెడి కొడ్కులు మఱాడ్డి పో
లి రెడ్డిని తమ తలిదండ్రుల
కు ధామ్మార్తముగా మల్లే
స్వర శ్రీమహాదేవరకు
అఖండదీపన కిచిన మో
దలు 25 వీనింజేకొని కాంపె
బోని కొడ్కు గంగనబోండు కొ
మ్మనబోండు తన పుత్రా
ను పౌపుత్రికము నిత్య(మా)
నెడ నెఇ పోయంగలవండు।
ఇ బో యున్కి ఊడవరెడ్డిప
ల్లి మున్ముంద దేవరా గుడి
కడ నీరునేల మత్తుర।

35

## 51. ఊడపరెడ్డిమల్లిరెడ్డిశాసనము

ఇది మల్లీశ్వర స్వామి ఆలయ స్తంభంపైన తొమ్మిది లైన్లలో చెక్కిన శాసనం. శాసనకాలం. శక సంవత్సరం 1198 అనగా క్రీ.శ. 1276 ఆ సంవత్సరం ఊడపరెడ్డి మలిరెడ్డి ఒక మరుతురు భూమిని స్వామికి నైవేద్యంగా దానిమిస్తున్నట్లు వేయించిన శాసనమిది. ఈ శాసనం చూస్తే అర్థంతరంగా ఆగిపోయినట్టు కనిపిస్తున్నది.

### శాసనపాఠం

స్వస్తి। శ్రీ శ
కవర్షంబులు 1198
నేండు మలేశ్వర
శ్రీ మహాదేవర
కు ఊడపరడి మ
లి రడ్డి పలిప...
మిన నివేద్యము
నంకు ఇచ్చిన మ
ఱుతు।

## 52. బెజవాడమ్యూజియంలోని శాసనము

బ్రాహ్మణవీధి సమీపాన దర్గా వద్దగల ఇరిగేషన్ శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ ఆఫీసు ఆవరణలో ఈ శాసనం ఉండేది. ఈ శాసనశాలలో ఆరు శాసన పాఠాలున్నాయి. ఆరింటిలో ఇది రెండవది. ఈ శిలను అమరావతినుంచి రావించారు. ప్రస్తుతం విక్టోరియా మ్యూజియంలో భద్రంగా ఉంది. ఇది అనేక దోషాలతో కూడిన సంస్కృత శాసనం. అర్థం సమంగా తెలియరావడంలేదు.

### శాసన పాఠం

-- జ్ఞాతి వర్గ ప్రియసుత సహితానే వాన్నుకీర్త్యా సం
క్రముద్రి -- రక్షితారఇతి -- సర్వ్వసత్వా స్సు---

# 53. చీడెబోయునికేతన శాసనము

ఇంతకు పూర్వం శాసనం వలెనే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ ఆఫీసు ఆవరణలోగల రాతిపైన గల ఆరు శాసనాలలో ఇది ఒకటి. 28 లైన్లు ఉన్నాయి. ఒకటి, 11, పన్నెండు, 13, పదిహేడు 18 పంక్తులలో అక్షరాలు చెదిరిపోయాయి. శాసనంలో శక సంవత్సరం పేర్కొనలేదు. సింగనబోయదు వద్దెబోయని గుట్ట ఉత్తరాన సంధ్యాదీపానికి న 5, ఉప్పలపాటి క్షేత్రానికి ఉత్తరాన, పాలపర్తికి ఈశాన్యాన 5 ఖండ్రికలు, వల్లూరుకు పడమట 2 ఖండ్రికలు, చౌటపల్లికి పడమట 3 ఖండ్రికలు, నాగహారం గ్రామానికి దక్షిణాన పాత్రభోగ్యం కోసం 2 ఖండ్రికలు, చేమ న 5 భూములను కేతన అనే ఆసామి తన తల్లితండ్రుల పుణ్యం కోసం మల్లీశ్వరస్వామికి సంధ్యాదీపం ఎత్తించదలచి దానం చేశాడు. ఈ శాసనంలోని కొన్ని గ్రామాల ఉనికి భూముల విస్తీర్ణం తెలియదంలేదు.

## శాసనపాఠం

... .... ....
సింగనబో
యుండుప
ద్దె బోయుని
గుంట్ట ఉత్త
రాన సంధ్య
దీపానకె న 5
ఉప్పలపాటి ఉత్తరాన న ---
పాలపత్తి ఈశాన్యాన ఖ 5
వల్లూరిపల్లి పద్మట ఖ 2 చ
పుటపల్లి షద్మట ఖ 3
నంద్దిమారిసెటి పం - -
క్య నాగరహారం బో .....
ని దక్షిణాన
భోగాపాత్ర
నకు ఖ 2న
... మర ....
.... .... ....
ట్టిన చేను న 5 చీడెబోయి
ని కేతన తమ తల్లిదండ్రికి ధం
మ్మ్రుాపుగా సంధ్య దీపమునకుం బె
టిన మొదవులుం జేకొని పూజారు
లు నడపంగలవారు।

# 54. దానయ చొక్కపాత్రుని శాసనము

సంవత్సరం, శకం ఏదో తెలియదుగాని ఇదొక విచిత్రమైన శాసనం. శాసనకర్త దాసమహంతి కుమారుడు శివమహాపాత్రుని అన్న చొక్కాయిపాత్రుడు వేయించిన శాసనం. మల్లీశ్వరాలయంలోని కేశవనాధుని గుడికి సున్నం వేయించిన సందర్భంగా వేయించిన శాసనం. శ్రీముఖ సంవత్సరం ఆదివారంనాడు శాసన ప్రకటన జరిగింది. శాసనం నాల్గవపంక్తి చివర నుంచి పాఠం మారిపోయింది. దీనిని రెండవ భాగంగా పరిగణిస్తే అది పద్యంగా భావించవచ్చు. దానయచొక్కపాత్రుని దాన ప్రతాపం గురించి చెప్పడంకోసమే ఈ పద్యం వ్రాశారు. అతడు ఉన్నతమైన దానవారాశియై సిరిసంపదలకు నిలయమైన మోటురీపురం (మోటుపల్లి)లో దక్షాధ్వరమును ధ్వంసం చేసిన కళ్యాణ వీరేశ్వరుని ప్రతిష్ఠించినట్టు పద్యంలో ఉంది.

## శాసన పాఠం

1. శ్రీముఖ సంవత్సర మాఘ శుద్ధ 5 ఆదా
2. స మహంతి కుమారుడు శివ మహా పా
3. తృని అంన చొకాఇపాతృడు మల్లేశ్వరుని గుళ్లోని కే
4. శవనాధని గుడి సుంసం శేయించెను॥ ఔరా దాసయ చొ
5. క్కపాతృడు సమాంన్నత్య దానవారాశియై శ్రీ రంజిల్లెటి
6. మోటురీపురి బ్రతిష్ఠించ్చెన్ ముదంబొప్పగా తారేందు గ్రహ
7. సూర్యమైనెంచి దక్షాధ్వరధ్వసునింన్ కారుంణ్యాకరమా
8. న సాంబురుహిణీ కళ్యాణ వీరేశ్వరుంన్॥ శ్రీశ్రీశ్రీ
9. జేయునున్॥
10. చగఇ పాత్ర.





**కొనకంద్ర వాడి భీమరాజు శాసనం :** *1877* ప్రాంతంలో అప్పటి కృష్ణాజిల్లా కలెక్టర్ రాబర్ట్ స్యూయల్ మల్లేశ్వర స్వామి గుడి ప్రాంగణంలో కను గొన్నాడు. అప్పుడు ఈ ప్రాంతాన్ని భీమ రాజు పరిపాలించాడు. విజయవాడను రాజధానిగా చేసుకుని *330* గ్రామా లను పరిపాలించిన పరమ శివభక్తుడు. అప్పుడు విజయవాడను విజయవాటిక పురి అనేవాళ్ళు. అదే ఈ శాసనంలో కనబడుతున్నది.





**చట్టపుని శాసనం :** ఇది షుమారు 1100 సంవత్సరాల నాటి శాసనం. శాసనకర్త ఇమ్మడి చాళుక్య భీముడు. బెజవాడను రాజధానిగా చేసుకుని ఈ ప్రాంతాన్ని 30 సం॥లు పాలించాడు. అప్పటి లిపిలో విజయవాటాణ్యపురి అని ఎలా వ్రాసేవారో కనబడుతుంది.





**దుర్జయ నరేంద్రుని శాసనం :** కృష్ణాజిల్లా ప్రాంతాన్ని పరిపాలించిన పురాతన రాజవంశాలలో దుర్జయ వంశము ప్రధానమైనది. ఆ వంశంలో ప్రముఖుడు నరేంద్ర భూపతి. ఆయన విజయవాడను రాజధానిగా చేసుకుని పరిపాలించాడు. అప్పటి లిపిలో విజయవాడ ఎలా వ్రాసేవారో ఈ శాసనంలో చూడవచ్చు.





**మహామండలిక చెంగయ నాయకుని గురువు గుముదూరి ఈశ్వరభట్టు సోమయాజుల శాసనం :** క్రీ.శ. *1165* ప్రాంతంలో బెజవాడ ప్రాంతాన్ని చెంగయనాయకుడు అనే మహామాండలికుడు పరిపాలించాడు. ఆయన తన గురువు ఈశ్వరభట్ట సోమయాజులుకి మల్లేశ్వరస్వామి అర్చనకోసం *55* గేదెలు దానం చేశాడు. ఆ రోజుల్లో ఈ నగరాన్ని బెజవాడ అనేవారు. శాసనంలో బెజవాడ పేరు ఎలా వ్రాశారో గమనించవచ్చు.





**మాచల్దేవి శాసనం :** ఇది క్రీ.శ. 1435లో మాచల్దేరి నిర్మించిన శాసనం. ఆమె కృష్ణానది సాక్షిగా పృథ్వీంగల గోత్రీకుల పుణ్యం కోసం మల్లేశ్వరస్వామికి దానాలు చేసింది. ఈ శాసనంలో తాడేపల్లి, పెనుమాక, ఎనికేపాడు, పటమట, పులిపాక, గుణదల గ్రామాల పేర్లు కనిపిస్తాయి. ఆ రోజుల్లో బెజవాడలో పాపవినాశేశ్వర ఆలయం ఉండేది. కృష్ణానదిని కృష్ణవేణియా నది అనేవారు. ఈ వివరాలన్నీ శాసనంలో ఉన్నాయి. అప్పటి లిపిలో బెజవాడ పేరును ఎలా వ్రాశారో చూడండి.



**సింగయదేవరాజు శాసనం :** కనకదుర్గ ఆలయం ముందుగల స్తంభంపై చెక్కిన శాసనం. 240 లైన్లుగల సుదీర్ఘమైన శాసనం. 21 శ్లోకాలు, 70 పంక్తులలో సంస్కృత వచనం, మళ్ళీ తెలుగులో లిఖించిన శాసనం. మొత్తం సంస్కృత భాగం 141 లైన్లు. 1518లో కృష్ణదేవరాయల ప్రధానమంత్రి తిమ్మరుసుకు సమకాలికుడైన సింగయదేవమహారాజు వేయించిన శాసనం. ఇందులో అనేక చారిత్రక వివరాలు ఉన్నాయి. మాధవ వర్మ వంశానికి చెందిన 20 మంది ప్రముఖుల పేర్లు కనిపిస్తాయి. ఈ శాసనంలో ఈ నగరాన్ని విజయశ్రీవాటిక అని కూడా ఉదహరించబడింది. ఈ శాసనంలో బెజవాడను ఎలా వ్రాశారో చూడండి.





**సూరపోతరాజుల శాసనం** : ఇది క్రీ.శ. 1235లో సంక్రాంతి పండుగనాడు అప్పటి బెజవాడ మహామండలేశ్వరుడు కొనకంద్రవాటి సీమకు చెందిన సూరపోతరాజు వేయించిన శాసనం. బెజవాడ సమీపానగల యనమలకుదురు గ్రామంలో ఒక ఖండ్రిక భూమిని, 26 గేదెలను మల్లేశ్వరస్వామికి దానం చేశాడు. ఈ శాసనంలో బెజవాడ పేరు ఎలా వ్రాశారో గమనించవచ్చు. శాసన లిపి, అక్షర విన్యాసం ఎంత అందంగా ఉందో చూడవచ్చు.





**త్యాగిపోతరాజు శాసనం :** కృష్ణాజిల్లా ముత్యాల నుంచి ఉయ్యూరు వరకు గల ప్రాంతాన్ని క్రీ.శ. 1197లో నతవాటిసీమ అనేవారు. ఈ ప్రాంతానికి కొంతకాలం బెజవాడ మరికొంత కాలం విజయవాడ రాజధానిగా ఉండేది. ఈ శాసనంలో జక్కంపూడి, బెజవాడ పేర్లు కనిపిస్తాయి. బెజవాడ పేరును విజయవాటికగా వ్రాశారు. ఈ శాసనంలో త్యాగి వంశంలోని గొప్ప పాలకుల పేర్లు కనిపిస్తాయి.



**యుద్ధమల్లుని శాసనం :** ఆంధ్రదేశ చరిత్రలో ముఖ్యంగా కృష్ణాజిల్లా బెజవాడ చరిత్రలో ప్రాచీనమైనది యుద్ధమల్లుని శాసనం. ఈ శాసనకాలం క్రీ.శ. 820-896. చాళుక్య వంశంలో ప్రసిద్ధుడైన యుద్ధమల్లుడు వేయించిన శాసనం. ఆయన రాజధాని నేటి గుంటూరు జిల్లా చేబ్రోలు. మహాశివభక్తుడు. తనకు అత్యంత ప్రీతిపాత్రమైన కుమారస్వామి ఆలయానికి చేబ్రోలులో రక్షణ లేదని భావించి విజయవాడ ఇంద్రకీలాద్రిపై కుమారస్వామి గుడి కట్టించాడు. గొరగ కులస్తులకు ఒక సత్రం కూడా నిర్మించాడు. తెలుగు భాష ప్రాచీనతను తెలియజెప్పే శాసనమిది. ఇందులో మధ్యాక్కర వృత్తం కనిపిస్తుంది. లిపి వేంగి చాళుక్య లిపి. ఆ లిపిలో బెజవాడ పేరు చూడవచ్చు.





యుద్ధమల్లుని శాసనంలో కనిపించే మధ్యాక్కర వృత్తాన్ని మన జానపదులు పాటలుగా పాడుకుంటారు. అత్యంత మధురమైన ఈ వృత్తాన్ని నన్నయగారికి పూర్వమే ప్రసిద్ధంగా ఉండేది. తెలుగు సాహిత్య ప్రాచీనతను వివరించే ఈ శాసనం 1892లో మల్లీశ్వర స్వామి గుడికి, ప్రాకారానికి మధ్యగల ఖాళీ స్థలంలో మట్టిదిబ్బ త్రవ్వుతూ ఉండగా దొరికినది. మూడు ముఖాలుగల ఈ శాసనం మొదటివైపు పై నుండి కిందకి, రెండవ వైపు కింద నుండి పైకి, మూడవ వైపు మళ్ళీ పై నుండి కిందకి చదవాలి. ఇది ఈ శాసనం ప్రత్యేకత. ఇది అసంపూర్ణ శాసనం. తెలుగు చరిత్ర పరిశోధకులకు సుపరిచితమైన శాసనం. నేటికీ కూడా అనేక అంశాలు సమంగా బోధపడటం లేదు.

# OUR TEAM

*Chairman*
**Sri K. Prabhakara Reddy,** IAS
Former Collector, Krishna Dist. (2003-2005)
Addl. Secretary to Chief Minister, Andhra Pradesh
Editor of the New Manual

***Asst. Editors***
Sri Lanka Venkata Ramana, Cell : 9440087420
Dr. G.V. Purnachand, Cell : 9440172642

***Editorial Board***
Sri Nanduri Rama Mohana Rao
Sri C. Raghavachari
Padmasri Turlapati Kutumba Rao
Sri Veeraji
Sri Andavilli Satyanarayana
Sri Avancha Satyanarayana
Sri Krishnaji

***Managing Committee***
Sri Dasari Ramakrishna, Cell : 9849081177
Sri Parvathaneni Shanti Kishore, Cell : 9440172041
Sri Immadisetty Rama Kumar, Cell : 9848122879
Sri Seeram Rama Rao, Cell : 9440172042
Sri E. Gopala Krishna Reddy, Cell : 9849363144
Sri Makkena Anjaneya Rao, Cell : 9440666333
Sri Maganti Subrahmanyam, Cell : 9848114459

***Consultant***
*Prof. A. Anuradha*

***Co-ordinators***
Sri Ch. Purnachandra Rao (Machilipatnam)
Sri U. Abja Rao.

***Advisory Committe :***
Sri M. Narayana Prasad
Sri Ashok
Sri Babji
Sri R. Rama Swamy
Sri Guttikonda Subba Rao

# కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటి


Ln. I. Ramakumar


Sri. Maganti Subrahmanyam


Sri. E.Gopala Krishna Reddy


Sri. S. Rama Rao


Sri. Lanka Venkata Ramana


Chairman
Sri K.Prabhakara Reddy, I.A.S.
Adl. Secretary to the C.M.


Dr. G.V. Purnachand


Sri. Dasari Rama Krishna


Sri. P. Santi Kishore


Sri. M. Anjaneya Rao

